# కృష్ణ మూస

## (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)

కృష్ణ - మూసా

ఏసు - ఈసా

నేను - యాసా

నీవు - పాసా

(ఎవరూ పాసు కారు. అందరము ఫెయిలే)


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org



# కృష్ణ మూస

## (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)


<u>రచయిత</u>

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (76) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-38 ప్రథమ ముద్రణ : జూలై-2016

ప్రతులు : 1000 వెల : **60 /-**

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

### "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
**80) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**81) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**82) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**83) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

**భాషలో పాండిత్యమును వదలి**
**భావములో పాండిత్యమును చూచువాడు**
**నిజమైన జ్ఞాని**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం- లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము- మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.

*DVD'S*

57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
చనిపోయాడా? చంపబడ్డాడా?
116. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**

అనంతపురము టౌన్, A.P.

Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)

క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)

ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)

చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)

నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)

రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)

కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)

బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)

జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# కృష్ణ మూస
## (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)

సృష్టింపబడినది సృష్టి. సృష్టి అనగా విశ్వము అనియూ లేక ప్రపంచమనియూ చెప్పవచ్చును. వివిధ జీవరాసులతో కూడుకొని విశాలముగాయున్నది విశ్వము. ముఖ్యమైన ఐదు మహా భూతములతో తయారు చేయబడినది ప్రపంచము. ప్రపంచమును తయారు చేసిన వాడు లేక విశ్వమును తయారు చేసినవాడు లేక సృష్టిని సృష్టించిన వాడు ఒక్కడే. ప్రపంచమనినా, విశ్వమనినా, సృష్టి అనినా ఒక్కటే. కనిపించని వాడు కనిపించే ప్రపంచమును తయారు చేశాడు. కనిపించని వాడు తయారు చేసిన దానిని సృష్టి అనియూ, విశ్వము అనియూ, ప్రపంచము అనియూ మూడు పేర్లతో పిలుస్తున్నాము. కనిపించని వాని చేత కనిపించునది తయారు కాగా దానికి ఒకటి విశ్వము, రెండు సృష్టి, మూడు ప్రపంచము అని మూడు పేర్లు పెట్టబడినాయి. కనిపించనివాడు వెదకినా దొరకడు. వెదకినా దొరకని వానిని కనిపించనివాడు అని అనడము సహజము. వెదకినా దొరకనివాడు అయినందున ఆయనను ఒక ప్రత్యేకమయిన అర్థముతో పిలుస్తున్నాము. వెదికితే దొరకనివాడు కావున 'దేవులాడబడే వాడు దేవుడు' అని అన్నారు. వెతకబడేవాడేగానీ, కనిపించే వాడు కాడు, కావున దేవుడు అని సర్వసాధారణముగా అనవచ్చును. కనిపించని దేవుడు మూడు పేర్లతోయుండు కనిపించే ప్రపంచమును తయారు చేశాడు, కావున దేవుడని మూడు రకముల పిలువబడుచున్నాడు. దేవునికి వాస్తవముగా పేర్లు లేవు, 'దేవుడు' అనబడునది కేవలము బిరుదు మాత్రమే గానీ పేరు కాదు. ఆటగానికి ఒక పేరుతో ప్రమేయము లేకుండా వాడు ఆట ఆడే దానిని బట్టి ప్లేయర్ అంటున్నాము. ప్లేయర్ అంటే ఆడేవాడు అని అర్థము. అంతేగానీ అది ఆటగాని పేరు కాదు కదా!

అలాగే సినిమాలో (చలన చిత్రములో) నటించే వానిని నటుడు అని తెలుగులో, యాక్టర్ అని ఇంగ్లీషులో అనడము జరుగుచున్నది. యాక్టర్ అనునది అతని పేరుకాదు కదా! అలాగే కనిపించని వాడు చేసిన పనిని బట్టి ఆయనకు బిరుదులు రావడము జరిగినది. అలాగే దేవుడు అనునది బిరుదని తెలియవలెను. దేవునికి పేరు లేదు కావున ఆయనను కేవలము బిరుదులతోనే పిలువ వలసి వచ్చినది. దేవుడు తయారు చేసిన దానిని మూడు రకముల పేర్లతో పిలుస్తున్నాము. అందువలన దేవునికి కూడా మూడు రకముల బిరుదులు వచ్చాయి.

దేవుడు తయారు చేసిన దానిని ఒకటి సృష్ఠి అను పేరుతో పిలుస్తున్నాము. సృష్ఠిని తయారు చేసినవాడు కావున ఆయనను 'సృష్ఠికర్త' అని అంటున్నాము. విశ్వమును తయారు చేసినవాడు 'పరమాత్మ'యని అంటున్నాము. ప్రపంచమును తయారు చేసిన వానిగా 'అల్లాహ్' అని అంటున్నాము. దేవునికి ముఖ్యముగా మూడు బిరుదులున్నాయని అవియే ఒకటి సృష్ఠికర్త, రెండు పరమాత్మ, మూడు అల్లాహ్ అని చెప్పుచున్నాము. వివిధ జీవరాసులతో కూడుకొని విశాలముగా యున్న విశ్వమును తయారు చేసినవాడు పరమాత్మ అనియూ, సృష్ఠిని తయారు చేసిన వాడు అయినందున సృష్ఠికర్త అనియూ, ప్రపంచమును తయారు చేసినవాడు అయినందున అల్లాహ్ అనియూ చెప్పబడుచున్నాడు. సృష్ఠి తయారయిన తర్వాత దేవుడు ఆకాశవాణి ద్వారా తన జ్ఞానమును సూర్యునికి చెప్పగా, సూర్యుడు భూమి మీద మనువు అనే వ్యక్తికి చెప్పడము జరిగినది. సూర్యుడు మనువు అను వ్యక్తికి తెలుగు భాషలోనే చెప్పడమైనది. ఆ కాలములో భారతదేశము లోనూ మిగతా దేశములలోనూ తెలుగు భాషయే ఉండెడిది. తెలుగు భాష దక్షిణ భారత దేశములో తయారయినది. అప్పటి కాలములో దక్షిణ

భారతదేశముతో కలిసియున్న శ్రీలంకలోనే తెలుగు భాష తయారయినది. అందువలన స్వచ్ఛమయిన తెలుగు భాషలో 'శ్రీలంక' అను దేశము నేటికీ ఉన్నది. 'లంక' అనునది తెలుగు పదమే, 'శ్రీ' అనునది తెలుగు పదమే అని జ్ఞాపకము పెట్టుకోవలెను.

శ్రీలంక ఆ కాలములో భారతదేశములోని భాగముగానే ఉండెడిది. అందువలన లంకను కూడా దక్షిణ భారతదేశముగా చెప్పుచున్నాము. దక్షిణ భారతదేశములో లంక, తమిళనాడు, కేరళ, ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రములు ఉండగా దక్షిణ భారతదేశమునకు అనుసంధాన రాష్ట్రములుగా మహారాష్ట్ర, ఒరిస్సా ఉండేవి. భారతదేశములోని మొదటి భాష తెలుగు భాషయే. దక్షిణ భారతదేశములోని మనువు అను వ్యక్తికి సూర్యుడు తెలుగు భాషలోనే తనకు తెలిసిన జ్ఞానమును చెప్పడమైనది. అప్పటి జ్ఞానులందరూ మనువు ద్వారా జ్ఞానమును తెలిసినవారై యుండిరి. మనువు సూర్యునికి ఆదిత్యుడని బిరుదును పెట్టినట్లు, మనువు చెప్పిన జ్ఞానమును తెలిసిన జ్ఞానులు అందరూ కలిసి, బాగా ఆలోచించి దేవునికి మూడు బిరుదులు పెట్టడమైనది. అప్పటి వారు అందరూ తెలుగు భాషను తెలిసినవారే అయినందున, అందరూ కలిసి తెలుగు భాషలోనే మూడు పేర్లవలె యున్న మూడు బిరుదులను దేవునికి చెప్పారు.

అందులో సృష్టికర్త అను పదముగానీ, పరమాత్మ అను శబ్దము గానీ, అల్లాహ్ అను మాటగానీ అన్నీ పూర్తిగా స్వచ్ఛమయిన తెలుగు పదములేయని చెప్పవచ్చును. మూడుకంటే ముందే పేరు కానటువంటి బిరుదు అయిన 'దేవుడు' అను పదము కూడా పూర్తి తెలుగు భాషతో తయారయినదే అని చెప్పవచ్చును. దేవుడు అనగా దేవులాడబడే వాడు అని అర్థమును తెలుగు భాషలోనే యుండునట్లు తయారు చేశారు. అయితే

కృతయుగములోనే తయారయిన పేర్లవలె యున్న దేవుని బిరుదులు మూడు స్వచ్ఛమయిన తెలుగు భాషలోనివేయని ఎవరికీ తెలియదు. ఇప్పుడు మేము చెప్పినా వినే పరిస్థితిలో లేరు.

**ప్రశ్న :- నేడు భూమిమీద మొత్తము పన్నెండు మతములున్నా అందులో మూడు మతములు మాత్రమే ముఖ్యముగా యున్నవి. ఆ మూడులో ఒకటి హిందూ మతము, రెండు క్రైస్థవ మతము, మూడు ఇస్లామ్ (ముస్లీమ్) మతముగా యున్నవి. హిందూ మతము మొదట మతముగా లేకున్నా, క్రైస్థవ మతము పుట్టిన తర్వాత హిందువులను హిందూ మతము అన్నారు. హిందూ మతము యొక్క పుట్టుక ఎవరికీ తెలియదు. దానికి ఫలానా ప్రవక్తయని కూడా లేదు. క్రైస్థవమతము యొక్క ప్రవక్తయున్నాడు, క్రైస్థవ మతము యొక్క పుట్టుక రెండు వేల సంవత్సరములు. ఇస్లామ్ మతము యొక్క పుట్టుక దాదాపు 1400 సంవత్సరములు. ఇస్లామ్ మతము యొక్క ప్రవక్త ముహమ్మద్ ప్రవక్తగారు. ఇస్లామ్ మతస్థులు దేవున్ని "అల్లాహ్" అని అంటున్నారు. ఇస్లామ్ మతములో మాత్రము దేవున్ని అల్లాహ్ అని చెప్పడము జరుగుచున్నది. ఇస్లామ్ మతము (ముస్లీమ్ మతము) 1400 సంవత్సరములప్పుడు పుట్టియుంటే దానిప్రకారము అల్లాహ్ అను పదము 1400 సంవత్సరములనుండి మాత్రమే వాడుకలోనికి వచ్చినది. హిందూ మతములో దేవున్ని "పరమాత్మ"యని అంటున్నారు. తర్వాత ఎన్నో పేర్లతో (బిరుదులతో) పిలుస్తున్నాము. క్రైస్థవ మతములో "ఎహోవా" అను పేరుతో పిలుస్తున్నారు. ఒక్క ఇస్లామ్ మతములో మాత్రము దేవున్ని "అల్లాహ్" అను పేరుతో (బిరుదుతో) చెప్పుచున్నారు. సంస్కృత భాషలో భగవద్గీత వ్రాయబడినది. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 17, 18 శ్లోకములయందు దేవున్ని పరమాత్మయని,**

**పురుషోత్తముడని రెండు పేర్లతో చెప్పడమైనది. బైబిలు గ్రంథములో "ఎహోవా" అని చెప్పబడినాడు. అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథములో దేవున్ని అల్లాహ్ అని వ్రాయడము జరిగినది. దీనిప్రకారము అల్లాహ్ అను పదము 1400 సంవత్సరముల పూర్వము అరబ్బీ భాషలో పుట్టినదనీ, ఖుర్ఆన్ గ్రంథములో వ్రాయబడినదని చెప్పవచ్చును. అల్లాహ్ అను పదమును ఒక్క ముస్లీమ్‌లు తప్ప ఇతర మతముల వారు వాడనప్పుడు సృష్ట్యాదిలోనే ఉన్న ఇందూ సమాజములోని జ్ఞానులు దేవున్ని అల్లాహ్ అని పిలిచారని మీరు చెప్పడము పచ్చి అబద్ధమని అర్థమగుచున్నది. దీనికి మీరు ఏమని జవాబు చెప్పగలరు?**

**జవాబు :-** ఎవరు ముక్కు సూటిగా వారు మాట్లాడడము సహజమే. అయితే మాట్లాడిన మాట సత్యమా?, అసత్యమా? అని తప్పనిసరిగా చూడవలెను. నేడు ముస్లీమ్‌ల చేత పిలువబడు 'అల్లాహ్' అను పదము ఈ మధ్య కాలములోనిదేయని చెప్పుటకు ఖుర్ఆన్ గ్రంథమే ఆధారముగా యున్నది. ఖుర్ఆన్ గ్రంథమును చూచిన ఏ మనిషి అయినా అల్లాహ్ అను పదము ఇస్లామ్ మతముతో, ఖుర్ఆన్ గ్రంథముతో మొదలయినదని ఎవరయినా చెప్పవచ్చును. ఇదంతయు చూచిన తర్వాత మా మాటను ఎవరూ నమ్మరు. మా మాట పూర్తి అసత్యముగా కనిపించును. నా మాట సత్యమో కాదో తర్వాత చూస్తాము. ముందు గమనించవలసిన విషయమును గురించి చూస్తాము. పూర్వము దర్జీవారు (టైలర్లు) (గుడ్డలు కుట్టు వారు) లేనప్పుడు, కొందరు స్వయముగా చేతితో కుట్టుకొని నడుము క్రింద గుడ్డను కట్టుకొనెడి వారు. అలా కట్టుకోవడము వలన క్రింద చల్లగా గాలి తగిలేది. పైన ఎంత వెడల్పు ఉండునో క్రింద అంత వెడల్పు యుండుట చేత కాళ్ళకు ఎటువంటి అడ్డము లేకుండా అన్ని వైపులా అల్లాడుచుండెడివి.

దాని ఆకారము చతురస్రాకారముగా యుండెడిది. చతురస్రాకారము గల గుడ్డను రెండు మడతలుగా తీసుకొని, నడుముకు తగిన విస్తీర్ణముకంటే రెండింతలు విస్తీర్ణముగా యున్న రెండు మడతల గుడ్డను తీసుకొని ఒకవైపు కొలతలో సగము వరకు రెండు మడతలను కోసి చేతికుట్టు వేసెడివారు. పై భాగమున ఇంచు కొలతలో మడచి చేతికుట్టు వేసి చిన్న తాడును మడతలో ఎక్కించి నడుముకు కట్టుకొనెడివారు. అలా తయారు చేసిన దానిపేరు "చల్లాడము" అని అనెడివారు. దాని ఆకారమును క్రింద చూడవచ్చును.



తయారు చేసినప్పుడు
ఉన్న ఆకారము



ధరించిన తరువాత
ఉన్న ఆకారము

పై ఆకారముతో తయారు చేసిన దానిని నడుముకు కట్టుకొన్నప్పుడు పై వెడల్పు సగానికి తగ్గిపోయెడిది. క్రింద మోకాలు వరకు పొడవు ఉండేది. దానిని కట్టుకోవడము వలన కాలికి వెడల్పుగాయుండి గాలి దూరడమునకు అనుకూలముగా యుండి, నడచినప్పుడంతా కదలుచూ గాలిని వీచినట్లు చేయుట వలన, చల్లగా అల్లాడునది కావున దానిని "చల్లాడము" అను పేరుతో చెప్పెడివారు. నూట యాభై, నూట అరవై సంవత్సరముల క్రిందట ప్రతి పల్లెలోనూ ఈ చల్లాడములను మగవారందరూ కట్టుకొనెడివారు. కాలక్రమేపీ పల్లెలకు సహితము టైలర్లు (దర్జీవారు) రావడము వలన చేతికుట్టు చల్లాడాలు లేకుండా పోయినవి. ఈ కాలములో

చల్లాడాలు చూచినవారు చాలా వరకు ఎవరూ లేరని చెప్పవచ్చును. కనీసము దాని పేరు వినిన వారు కూడా అరుదుగా యుందురు. నూరు, నూటయాభై సంవత్సరముల క్రిందట ఎక్కువమంది చల్లాడములు వాడెడి వారు. యాభై లేక అరవై సంవత్సరముల క్రిందట కూడా కొన్ని మారుమూల ప్రాంతములలో చల్లాడాలు కట్టుకోవడము నేను చూచాను. తర్వాత అవి లేకుండా పోవడము జరిగినది. నేడు పట్టణ ప్రాంతములలో "చల్లాడాలు అంటే ఏమిటో మాకు తెలియదు" అంటున్నారు.

ఈ విధముగా కాలక్రమములో తెలియకుండా పోయిన చల్లాడాలను గురించి మేము చెప్పినా, మేము చెప్పేది సత్యమో అసత్యమో తేల్చుకోలేక పోవుచున్నారు. అల్లాహ్ అను పదము కూడా పూర్వము ఉండి తర్వాత లేకుండా పోవడము వలన పూర్వము ఆ పదము ఉన్నదని మేము చెప్పినా మనుషులు నమ్మే స్థితిలో లేరు. తిరిగి ఇప్పుడు చల్లాడాల విషయానికే వస్తాము. పూర్వముండి కొంత కాలము లేకుండా పోయిన చల్లాడములు తిరిగి నేడు అందరి దగ్గరికి వచ్చినవి. వాటిని చాలామంది ధరించుచున్నారు. అయినా అవి పూర్వమున్న చల్లాడాలేయని ఎవరూ గుర్తించలేదు. నేడు వాటిని ఇంగ్లీష్ భాషలో షాట్‌లని చెప్పుకోవడము జరుగుచున్నది. నేడున్న షాట్‌లే పూర్వమున్న చల్లాడాలు అని ఎవరికీ తెలియకుండా పోయినది. ఇంగ్లీషులో షాట్‌లని చెప్పబడునవే పూర్వపు చల్లాడాలని ఎవరూ గుర్తించలేక పోయారు. అదే విధముగా పూర్వమున్న అల్లాహ్ అను పదమే నేడు ఖుర్‌ఆన్‌లో చెప్పబడిన పదమని ఎవరూ అనుకోవడము లేదు. పూర్వము అల్లాహ్ పదమున్నట్లే తెలియకపోవడము వలన ఇప్పుడు మేము చెప్పినా నమ్మలేకయున్నారు. పూర్వమున్న చల్లాడాలు పేరు మార్చుకొని షాట్‌లని చెప్పబడుట చేత, చల్లాడాలే షాట్‌లుగా వచ్చాయని గుర్తించలేదు అంటే

ఒక విధముగా ఒప్పుకోవచ్చును. అయితే పూర్వము జ్ఞానులు చెప్పిన అల్లాహ్ అను దేవుని గుర్తును నేడున్నదని మేము చెప్పినా వినక పోవడము, నమ్మక పోవడము విచిత్రమనియే చెప్పవచ్చును.

కృతయుగము మొదటిలో తెలుగు భాషయుండుట వలన దక్షిణ భారతదేశపు జ్ఞానులు తెలుగు భాషలో దేవుని పేరును మూడు విధముల చెప్పడమైనది. సృష్ఠిని సృష్ఠించినవాడు అయినందున దేవున్ని సృష్ఠికర్త యని చెప్పారు. కర్త యనగా తయారుచేసినవాడని చెప్పవచ్చును. సృష్ఠిని తయారు చేసిన వాడని దేవున్ని సృష్ఠికర్త యను పేరు (బిరుదు)తో పిలిచారు. ఆత్మకంటే వేరుగాయున్నాడను భావముతో పరమాత్మయని అన్నారు. ఈ రెండు పేర్లు అనగా బిరుదులు తెలుగు అర్థముతో కూడుకొని యున్నవి. అలాగే ఆనాడు తెలుగు పదముగా అల్లాహ్ అను పదమును చెప్పారు. సూర్యగ్రహము చెప్పినట్లే జిబ్రయేల్ గ్రహము కూడా తెలుగు పదమునే చెప్పినది. సూర్యుడు మనువుకు భూమిమీద తెలుగు భాషలో చెప్పిన జ్ఞానమునే జిబ్రయేల్ కూడా చెప్పడమైనది. జిబ్రయేలు తాను విన్న అల్లాహ్ పదమునే తిరిగి ఖురాన్ జ్ఞానములో చెప్పడము జరిగినది. ఖురాన్ గ్రంథములో జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తకు జ్ఞానము చెప్పినప్పుడు అరబ్బీ భాషలో చెప్పినా, దేవుడు అను మాటను చెప్పవలసి వచ్చినప్పుడు పూర్వము తాను ఆకాశములో వినిన పేరునే అల్లాహ్ అని చెప్పాడు. ఖురాన్ గ్రంథమంతా అరబ్బీ భాషలో యుండుట వలన అల్లాహ్ అను పదము కూడా అరబ్బీ భాషయే అని అందరూ అనుకోవడము జరిగినది.

అల్లాహ్ అను పదము మొదటినుండి తెలుగు భాషలోనే యున్నదను విషయము ప్రపంచములో నేడు ఎవరికీ తెలియకుండా పోయినది. ఇతర భాషలో మాట్లాడునప్పుడు ఏదయినా ఒక పదము ఆ భాషలో తెలియకపోతే

తనకు తెలిసిన భాషలోనే చాలామంది చెప్పుచుందురు. అదే విధముగా జిబ్రయేల్ అరబ్బీ భాషలోనే ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పునప్పుడు, దేవుడు అని చెప్పవలసి వచ్చినప్పుడు తనకు పూర్వమే తెలిసిన అల్లాహ్ పదమునే చెప్పాడు. అల్లాహ్ అరబ్బీ భాష పదమే కాదు. అది ఆకాశములో జిబ్రయేల్ వినిన స్వచ్ఛమయిన తెలుగు భాష. తెలుగు భాష పూర్వము తయారయినప్పుడు భావమునకు, దృశ్యమునకు సరిపడు పదమునే తెలుగులో వాడడము జరిగినది. భావమునకు తగిన పదములను కల్గిన భాష తెలుగు భాష. భావమునకు లేక దృశ్యమునకు ప్రత్యక్ష శబ్దముగాయుండు ఏకైక భాష తెలుగు భాష. ప్రపంచములో మొదట తయారయినది, ప్రపంచములో భావముతో కూడుకొన్న శబ్దముగా యుండునది తెలుగు భాష తప్ప మరీతర భాష లేదని చెప్పవచ్చును. వెతకబడేవాడు దేవుడు అని దేవున్ని ప్రత్యక్ష భావముతో దేవులాడబడేవాడు దేవుడు అని దేవుని విధానమును ప్రత్యక్షముగా కనిపించు భావమును అమర్చి చెప్పిన భాష తెలుగు భాష.

అలాగే అల్లాహ్ అను తెలుగు పదములో అర్థముతో కూడుకొన్న దేవుని విధానమును ప్రత్యక్షముగా తెలుపునట్లు గలదు. **అల్లాహ్** అను పదమును విడదీసి చూస్తే **అ+ల్లాహ్=అల్లాహ్** అని చెప్పవచ్చును. అయితే ఈ పదములో **"ల్లాహ్"** అనగా అంతు, హద్దు, ఎల్లలు అని అర్థము గలదు. **"అ"** అని చెప్పడములో కాదు, లేదు అను అర్థమును చెప్పవచ్చును. **అల్లాహ్ = అంతు లేనివాడు అనియూ, హద్దు లేనివాడు అనియూ, ఎల్లలు లేనివాడు** అనియూ చెప్పవచ్చును. దేవుడు వాస్తవముగా అంతు దొరకని వాడు, ఏ మానవునికి తెలియనివాడు అయినందున, ఆ భావమునకు తగిన విధముగా అల్లాహ్ అను పదమును ఆ దినము జ్ఞానులు తయారు

చేశారు. ఆనాడు తయారు చేసిన తెలుగు పదములే సంస్కృత భాషలో కూడా పరమాత్మ, పురుషోత్తమ యని చెప్పబడినవి. పరమాత్మ, పురుషోత్తమ అను రెండు పదములు స్వచ్ఛమయిన తెలుగు భాషా పదములు. ఆ రెండు పదములను సంస్కృతములో భగవద్గీతను వ్రాసినప్పుడు మిగతా విషయమంతా సంస్కృత భాషలో చెప్పిన వ్యాసుడు దేవున్ని గురించి చెప్పవలసి వచ్చినప్పుడు భావమునకు తగిన తెలుగు భాష పదములనే వాడడము జరిగినది. అదే విధముగా ఖురాన్‌ను అరబ్బీ భాషలో వ్రాసినప్పుడు దేవుడు అని చెప్ప వలసి వచ్చినప్పుడు అరబ్బీ భాషలో సరియైన పదము లేక జిబ్రయేల్ చెప్పిన అల్లాహ్ పదమునే వాడడము జరిగినది. ఈనాడు సంస్కృతములో వ్రాసినంతమాత్రమున పరమాత్మ, పురుషోత్తమ అను పదములు రెండు సంస్కృత పదములు కాకుండా తెలుగులోనే అర్థమును చెప్పుచున్నవి. అలాగే ఖురాన్‌లో అరబ్బీ భాషయందు కలిపి అల్లాహ్ అని వ్రాసినా, అది అరబ్బీ పదము కాకుండా తెలుగులోనే దేవుడు అంతులేనివాడని చెప్పుచున్నది. సంస్కృతములో వ్రాసినా పరమాత్మ, పురుషోత్తమ పదములకు తెలుగులో అర్థము తప్ప సంస్కృతములో అర్థము లేదు. అలాగే అరబ్బీ భాషలో చెప్పినా అల్లాహ్ అను పదమునకు తెలుగులో తప్ప అరబ్బీ భాషలో అర్థము లేదు. మొదట పుట్టిన తెలుగు భాషను తర్వాత పుట్టిన అన్ని భాషలు వాడుకొన్నాయి. అవసరమునకు వాడుకొన్న తెలుగు పదములను కొంత కాలమునకు తమ భాషా పదములుగా చెప్పుకొంటున్నాయి. అయినా ఆ భాషలో వాటికి అర్థము లేదు. తెలుగు భాషలోనే తెలుగు పదములకు అర్థములు ఉండుట వలన ఏ భాషలో కలిసిపోయినా తెలుగు పదమును సులభముగా గుర్తు పట్టవచ్చును. నేనే కాదు తెలుగు పదములకు అర్థము తెలిసిన ఎవరయినా

తెలుగు పదములను ఏ భాషలో యున్నా సులభముగా గుర్తుపట్టవచ్చును. ఇప్పుడు బాగా ఆలోచించి చూడండి. అల్లాహ్ అను పదము తెలుగు పదమో కాదో మీరే చెప్పండి. తెలియని విషయములను తెలుపడము నా కర్తవ్యముగానీ, అబద్దము చెప్పవలసిన అవసరము నాకు లేదు.

**ప్రశ్న :- కొందరు అల్లాహ్‌కు (దేవునికి) సంతానము కలదని అంటుంటారు. ఏసు దేవుని కుమారుడు అని కొందరు క్రైస్థవులు చెప్పగా విన్నాను. దేవునికి కొడుకులున్నారా? బిడ్డలున్నారా?**

**జవాబు :-** అల్లాహ్ అంటే అంతు దొరకనివాడు. ఒకవేళ కొందరను కొన్నట్లు ఆయనకు కుమారుడేయుంటే దేవుడు పరిమితుడై పోయినట్లగును. ఆయన అపరిమితుడు, అందువలన ఆయనకు కుమారుడు లేడు. ఏసును కొందరు దేవుని కుమారుడని చెప్పినమాట వాస్తవమే అయినా వారి మాట సత్యము కాదని తెలియవలెను. బైబిలులో తండ్రి, కుమారుడు అను వాక్యములుండుట నిజమే. అయితే అది ముతషాబిహాత్ వాక్యమని (సూక్ష్మ అర్థముతో కూడుకొన్న వాక్యమని) వారికి తెలియదు. బైబిలులో ఉన్నట్లే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో కూడా సూక్ష్మ అర్థముగల వాక్యములు గలవు. **ఖురాన్ గ్రంథములో సూక్ష్మ వాక్యములున్నవని సూరా 3, ఆయత్ 7లో అల్లాహ్ చెప్పినప్పటికీ ఇటు ముస్లీమ్‌లు గానీ, అటు క్రైస్థవులుగానీ వాటిని విశధీకరించి చూడకుండా వదలి వేయుచున్నారు.** అందువలన వాటిలోని నిగూఢార్థము మనుషులకు తెలియకుండా పోయినది. తండ్రి, కుమారుడు అని ఇంజీలు గ్రంథములో చెప్పితే తండ్రి అంటే దేవుడని, కుమారుడు అంటే ఏసుయని అందరూ అనుకోవడము జరిగినది. అక్కడ చెప్పిన వాక్యము గూఢార్థముతో కూడుకొన్నదని, పైకి కనిపించు భావమును తీసుకోకూడదని ఎవరూ అనుకోలేదు. అందువలన దేవునికి

ఏసు అను ఒక కొడుకుయున్నాడని క్రైస్థవులు అనుకోవడము జరిగినది. వాస్తవముగా దేవునికి ప్రత్యేకించి కొడుకు లేడు. ఒక విధముగా చెప్పితే అల్లాహ్ సమస్త జనులకు తండ్రియే అని చెప్పవచ్చును. అందరినీ ఆయనే సృష్ఠించాడు కావున ఆయనను తండ్రి అనడములో తప్పులేదుగానీ, ఏ ఒక్కరికో తండ్రియని చెప్పడము తప్పగును. ఆయన సమస్త విశ్వమునకు తండ్రియే. అయితే కనిపించే తండ్రిలాంటివాడు కాదు. సృష్ఠించిన సృష్ఠికర్త అల్లాహ్‌యే అయినందున ఆయనను ఒక విధముగా తండ్రియని చెప్పినా ఆయనకు ఒకరుగానీ, ఇద్దరుగానీ కుమారులున్నారని చెప్పడము తప్పగును. ఈ విషయమై అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో సూరా 2, ఆయత్ 116లో ఇలా చెప్పారు. **(2-116) "అల్లాహ్ ఒక కుమారున్ని కలిగియున్నాడు అని అంటారు. ఆయన అన్నిటికీ అతీతుడు. వాస్తవానికి భూమి ఆకాశాలలో ఉన్నవన్నీ ఆయనకు చెందినవే, ఆయన సృష్ఠించినవే, అవన్నియూ ఆయనకు విధేయులై యున్నాయి."** ఖురాన్‌లోని ఈ వాక్యమును అనుసరించి చూస్తే "దేవుడు ఒకరికి సంతానము కాదు, ఆయనకు ఒకరు సంతానముగా లేరు" అను విషయము బాగా అర్థము కాగలదు. అలా ఒకరికి ఆయన తండ్రి అయితే ఆయనకు ఒక భార్య కూడా ఉండవలసి వస్తుంది. ఇలా భార్య, భర్త, సంతానముయుంటే ఆయన మనుషుల పోలిక అయిపోవును. ఆయన సమస్తమునకు దేవుడు అయినందున మనుషులవలె తండ్రి కాదు, ఆయనకు కొడుకు లేడు, ఆయన సంకల్పము చేత పుట్టినవారు విశ్వమంతా యున్నారు గానీ, ఆయన వీర్యబిందువు చేత పుట్టినవాడు ఎవడూ లేడు. ఆయన ఆ విధముగా ఎవరికీ పుట్టలేదు, ఆ విధముగా తండ్రీ కాదు. ఇదే విషయమునే ఖురాన్ గ్రంథములో 112వ సూరాలో 3వ ఆయత్‌లో ఇలా కలదు చూడండి.

**(112-3) "ఆయనకు సంతానము లేదు (బిడ్డలను కనడు) మరియు ఆయన కూడా ఎవరి సంతానము కాడు (ఎవరికీ జన్మించిన వాడు కాడు)"** అని కలదు. ప్రత్యేకించి మనుషులకున్నట్లు దేవునికి (అల్లాహ్‌కు) సంతానము లేదు. అలాగే అందరూ పుట్టినట్లు ఆయన ఎవరికీ పుట్టలేదు అని ఈ ఆయత్‌లో పూర్తిగా అర్థమయి పోవుచున్నది.

**ప్రశ్న :- దైవగ్రంథమును చదువమని మేము చెప్పితే వారు మాకంటే భక్తి ఎక్కువగా యున్నవారివలె మాట్లాడుచుందురు. మొదట వారిది నిజమైన భక్తియని మేము అనుకొన్నాము, తర్వాత వారికి ఏమాత్రము దేవుని ఎడల భక్తి లేదని తెలిసినది. వారు భక్తియున్నట్లు నటిస్తున్నారని అర్థమయినది. వారు ఎవరిని మోసము చేసినట్లు? దేవున్నా లేక మమ్ములనా?**

**జవాబు :-** దేవున్ని ఎవరూ మోసము చేయలేరు. అయితే దేవుని విషయములో భక్తియున్నట్లు నడచువారు ఎదుటి వారిని మోసము చేస్తున్నామని అనుకుంటారుగానీ, వారు ఎదుటివారిని మోసము చేయలేదు. వాస్తవానికి వారిని వారే మోసము చేసుకొంటున్నారు అని చెప్పవచ్చును. ఈ విషయము బాగా అర్థమగుటకు ఒక జరిగిన సంఘటనను వివరించు కొని చూస్తాము. మా అనుచరులు మేము వ్రాసిన **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథమును తీసుకొని ప్రచార నిమిత్తము పోయారు. మేము వ్రాసిన 80 గ్రంథములో అదొక గ్రంథము. అన్ని గ్రంథములను ప్రచారము చేయుచూ ఎవరు ఏ గ్రంథమును ఇష్టపడుతారో దానిని గురించి చెప్పి ఆ గ్రంథమును ఇచ్చెడివారు. వారి ప్రచారములో ఒక ముస్లీమ్ కుటుంబము తారసపడినది. అప్పుడు మా అనుచరులు ఖురాన్ గ్రంథములోని జ్ఞాన వాక్యములను గురించి వ్రాసిన

గ్రంథము మావద్ద యున్నదని చూపారు. వారు ఖురాన్ గ్రంథమంటే మాకు ఇష్టము అల్లాహ్ చెప్పిన ఆయతులు మేము ఇష్టముగా చదువుతాము అని చెప్పిన దానివలన అన్ని గ్రంథములను వదలి ప్రత్యేకించి **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను గ్రంథమును చూపారు. వారు చెప్పిన మాటనుబట్టి వారు ముస్లీమ్‌లని మావారు గ్రహించుకొని వారికి ఇష్టమైన గ్రంథమునే చూపారు. వారు ముస్లీమ్‌లయినా భక్తియున్న వారివలె నటించి మాట్లాడారు గానీ, వారికి అంతరంగములో నిజముగా భక్తి లేదు.

వారి మాటలను నమ్మిన మా వారు వారికి ఇష్టమైన గ్రంథమని ఖురాన్ వాక్యములున్న గ్రంథమును చూపారు. వారు గ్రంథమును తెరచి చూచి ఇందులో సూరా నంబరు, ఆయత్ నంబరు ఇచ్చి వాక్యమును వ్రాశారు సూరా పేరును వ్రాయలేదే అని అడిగారు. సూరా పేరు లేని దానివలన ఈ గ్రంథము మాకు వద్దు అని చెప్పి వెనక్కు ఇచ్చి పంపడము జరిగినది. మా వారు వచ్చి ఆ విషయమంతా చెప్పి సూరా పేరు ఎందుకు వ్రాయలేదని నన్ను ప్రశ్నించారు. అప్పుడు నేను వారికి కొంత వివరణ ఇవ్వడము జరిగినది. అది ఏమనగా! "బాగా ఆకలిగొన్న బిక్షగాడు నాలుగు ఇళ్ళు తిరిగి అడుక్కోవాలనుకోవడము సహజమే. కొన్నిళ్ళ వద్దకు పోయి అన్నమడిగినా బిక్షగానికి వారు అన్నమును పెట్టలేదు. ఓపికగా ఇంకా కొన్ని ఇళ్ళు తిరిగాడు. అప్పుడు ఒక ఇంటివారు విస్తరనిండ కూరలతో సహా అన్నమును తెచ్చి ఇచ్చారు. వారు ఇచ్చిన విస్తర అన్నమును తింటే వాని కడుపు నిండిపోతుంది. వేరే ఇంటికి పోయి వాడు అన్నమును అడుగవలసిన పనే లేదు. అప్పుడు ఆ బిక్షగాడు సంతోషముతో వారు ఇచ్చిన అన్నమును తిని కడుపు నింపుకొన్నాడు. వారు కడుపునిండా అన్నము పెట్టినందుకు వారిని దీవించి పోయాడు. ఇది నిజముగా ఆకలి గొన్న వాని విషయము.

తర్వాత కొంతసేపటికి  ఆ ఇంటికి మరో బిక్షగాడు వచ్చాడు. మొదటి వానివలె అతను కూడా అన్నము అడిగాడు.  ఆ ఇంటి వారు మొదటి వానికి అన్నము పెట్టినట్లే విస్తరులో కూరలతో సహా అన్నమును పెట్టారు.  అయితే ఆ బిక్షగాడు అన్నమును తీసుకోకుండా  ఆ ఇంటి యజమాని పేరు, ఆయన ఏమి చేస్తున్నది చెప్పి అన్నము పెట్టాలని చెప్పాడు. అలా చెప్పితే అతనిని దీవించి పోతాను అని అన్నాడు.  ఆ విధముగా ఎవరు అన్నము పెట్టినా అలాగే అడిగేవాడు.  కొందరు ఇంటి యజమాని పేరు, అతను ఏమి చేయుచున్నది చెప్పేవారు.  కొందరు నీకు అన్నము కావాలా? మా అడ్రసు కావాలా? అని అడిగి పేరు చెప్పకుండా, అన్నము కూడా పెట్టకుండా పంపేవారు.  వాస్తవముగా అతను అన్నము కొరకు ఇల్లిల్లూ తిరిగేవాడు కాదు.  ఎవరయినా అన్నము పెడితే దీవెనయని నటించి, వారు ఏమి చేయుచున్నది గమనించి, వారు మంచి ఆదాయము కలిగిన పని చేసేవాడయితే వారి ఇంటికి దొంగతనమునకు పోయి  వారి సొమ్మును దోచుకొనెడివాడు.  ఆకలి కొరకు అన్నము అడిగే వానివలె నటించుచూ, పైగా పెద్ద జ్ఞానివలె దీవించుతానని చెప్పుచూ ఇతరులను మోసము చేయుచున్నానని అనుకొనెడి వాడు.  అయితే వాస్తవముగా తనను తాను మోసము చేసుకొంటున్నానని, తనను తాను చిక్కులలోనికి నెట్టుకొంటున్నానని అనుకోలేదు.  అతను మాట్లాడే విధానమును బట్టి అతన్ని బిక్షగానివలె నటించుచున్న దొంగయని పోలీస్‌వారు గమనించి జైలుకు పంపడము జరిగినది.  ఇతరులను మోసగించుచున్నానని అనుకొనినా బిక్షగానివలె నటించువాడు చివరకు తనను తానే మోసము చేసుకొన్నట్లు, దానివలన అతను జైలుపాలయినట్లు మనకు తెలిసినది.”

జ్ఞానమను బిక్షను అడుగు జిజ్ఞాసి (జ్ఞానమును తెలియువాడు) తనకు కావలసిన జ్ఞానము ఎక్కడ దొరికినా సంతోషపడును.  అంతేగానీ

జ్ఞానము చెప్పినవాని వివరము అడుగడు. తనకు దొరికిన జ్ఞానము సరియైనదా! కాదా!యని చూచుకొనును. అంతేతప్ప మిగతా విషయములు అతనికి అనవసరమే. జ్ఞాన ప్రచారములో జిజ్ఞాసులవలె నటించి ఏవో సాకులు చూపి జ్ఞానమును వద్దని చెప్పడము వలన, వారు తెలివిగా ప్రవర్తించినట్లు అనుకొనినా, వారు అసలయిన దేవుని జ్ఞానమును నష్ట పోవుచున్నారు. తెలిసే జ్ఞానము కూడా వారి ప్రవర్తన వలన వారికి తెలియకుండా పోవుచున్నది. దానివలన వారు ఇతరులను అనగా జ్ఞాన ప్రచారము చేసిన వారిని మోసము చేశామని అనుకొనినా, నిజముగా వారిని వారు మోసము చేసుకొన్నట్లేయగుచున్నది. బిక్షమడుగువాడు ఇంటి యజమాని అడ్రస్ అడిగి తెలివిగా ఇతరులను మభ్యపరచి దొంగతనము చేయాలనుకొన్నా చివరకు తానే జైలుపాలయి పోయాడు కదా!

అల్లాహ్ అను పదమునకు తెలుగులో అర్థమును చెప్పాము. అది అరబ్బీ పదమో, తెలుగు పదమో తెలియకున్నా ఇక్కడ చెప్పిన అర్థము దేవుని విధానములో గొప్పగాయుండుట వలన అందరూ సమ్మతింపదగి నదైయున్నది. ఇంతకుముందు దేవున్ని అల్లాహ్ అనుటకు హిందువులు కొంత సిగ్గు పడెడివారు. ఇప్పుడు ఈ అర్థము తెలియుట వలన ఒక్క ముస్లీమ్‌లే కాక మిగతా అన్ని మతముల వారు కూడా దేవున్ని అల్లాయని సందర్భానుసారము పిలువడములో వెనుకాడరు. అల్లాహ్‌కు అర్థము తెలియుట వలన అల్లాహ్ అనడములో యున్న సిగ్గు ఎవరికీ లేకుండా పోయి దేవున్ని అవసరమొచ్చినప్పుడు అల్లాహ్ అనియే చెప్పుదురు. ఈ విధముగా చెప్పడము ఏదో మత ప్రచారము అని ఎవరూ అనుకోకూడదు. సత్యమును చెప్పడము తప్ప ఇందులో ఏమీ లేదు. అందువలన ఇక్కడ చెప్పబడే విషయములు మతములకు సంబంధించినవి కావనీ, మతాతీత

మైనవని తెలియవలెను. మతాతీతముగా మరికొన్ని పదములకు తెలుగులోనే అర్థములు తెలియుట వలన తెలుగు భాషా పాఠకులు సులభముగా చదువగలరని, బాగా అర్థము చేసుకోగలరని తలచుచున్నాను.

తెలుగు భాష ప్రపంచ భాషలలో మొట్టమొదటి భాషయనీ, ఆదిలో పుట్టిన భాష తెలుగు భాషయని అనేకమార్లు చెప్పుకొన్నాము. తెలుగు భాషను ఆధారము చేసుకొని మిగతా భాషలు పుట్టుకొచ్చినవి. అందువలన అనేక తెలుగు పదములు మిగతా భాషలలో కలిసిపోయినవి. భారత దేశమునకు దగ్గరగా యున్న దేశములలో ఆయా భాషలయందు తెలుగు పదములు ఎక్కువగా కనిపించుచుండును. నేను భాషా పండితున్ని కాకపోయినా నేను అరబ్బీ భాషలో యున్న అల్లాహ్ అను పదమునకు తెలుగులో అర్థము చెప్పుకొన్నాము. అదే కోవలోనే మనుషులు దైవ మార్గములో పోవుటకు కావలసిన విధముగా కొన్ని ముఖ్యమైన పదములకు అర్థము చెప్పుకోవడమైనది. ఇది తెలుగువారయిన హిందువులకు మాత్రమేననీ, ముస్లీమ్‌లకు కాదని కూడా చెప్పుచున్నాము.

అంతిమ దైవగ్రంథములో "దేవుని మార్గములో ముఖ్యమైన ఆరాధనలు నాలుగు" అని చెప్పారు. వాటిలో అన్నిటికంటే ముఖ్యమైనది, మొదటిది **"నమాజ్"** అని చెప్పారు. రెండవది **"జకాత్"**, మూడవది **"రోజా"**, నాల్గవది **"హజ్"** అని చెప్పారు. ఈ నాలుగు పేర్లు గల కార్యములు ముస్లీమ్‌లందరూ తప్పక ఆచరించవలెనని పెద్దలు చెప్పుచుందురు. వీటిని అర్థసహితముగా చెప్పుకొంటే నేడు ముస్లీమ్‌లలో వుండే అర్థము ప్రకారము 'నమాజ్' అనగా ప్రార్థన. 'జకాత్' అనగా దేవుని పేరు మీద దానము చేయుట, 'రోజా' అనగా పవిత్ర దినములలో ఉపవాసముండుట. 'హజ్' అనగా మక్కా యాత్ర చేసి రావడమని

చెప్పుచుందురు. ముస్లీమ్‌లందరూ ఈ విధానమునే తెలిసి, ఈ విధముగనే ఆచరించుచుందురు. కొందరు ముస్లీమ్‌లు ఆర్థిక ఇబ్బందులున్న వారు హజ్ దైవయాత్ర చేయలేక పోయినా మిగతా మూడు విధానములను తప్పక ఆచరించుచుందురు. ప్రార్థన చేయడములో ముస్లీమ్‌లందరూ మిగతా మతములకంటే ముందున్నారు. జకాత్ చేయడములో వారి వారి స్థోమతకు తగినట్లు చేయుచున్నారు. పవిత్ర రంజాన్ నెలలో ముస్లీమ్ లందరూ ఉపవాస కార్యక్రమము (రోజా) చేయడమును చూస్తూనే యున్నాము. ఈ నాలుగు ముస్లీమ్‌లకు ముఖ్యమైన కార్యములుగా చెప్పబడుచున్నవి.

అయితే ఈ నాలుగు కార్యములకు తెలుగు భాషలో అర్థములు కూడా చాలా గొప్పగనే యున్నవని చెప్పుచున్నాము. ఇప్పుడు మేము పదములోని అక్షరములకు తెలుగు అర్థమును చెప్పుకొంటున్నాము. గతములో ఎవరూ ఈ పదములకు తెలుగులో అర్థమును చెప్పకపోవడము వలన, ఇప్పుడు మేము చెప్పు అర్థములన్నియూ సత్యమైనవే అయినా సరిక్రొత్తగా కనిపించుచుండును. వినే వారికి అనుమానాస్పదముగా యుండును. మేము గడించిన అనుభవమును బట్టి మేము చెప్పునది సత్యమేయని తెలియవలెను. పైగా నా మాటలను వినుట వలన అది దేవునికి వ్యతిరేఖము కాదు. కాబట్టి నేను చెప్పే మాటలను వినండి.

నమాజ్, జకాత్, రోజా, హజ్ అను నాలుగు పదములలో ప్రతి దానియందు **"జ"** అను శబ్దము కల్గియున్నది. నమాజ్, జకాత్, రోజా, హజ్ అను శబ్దము పుట్టుకను సూచించును. 'జ' అనగా పుట్టుట యని అర్థము. దాని ప్రకారము నమాజ్ అను పదమును తీసుకొని చూస్తే న+మ+జ అను మూడు అక్షరములు గలవు. 'న' అనగా లేదు, కాదు

అని అర్థము. 'మ' అనగా నేను, నాకు అని అర్థము. 'జ' అనగా పుట్టుటయని అర్థము. దీనిని కలిపి చూస్తే "నాకు జన్మలు వద్దు" అను అర్థమును తెలియజేయడమునే నమాజ్ అని అనవచ్చును. నమాజ్‌లోని ఫలితము మనిషికి రెండవ జన్మ లేకుండా అదే జన్మలోనే దేవునియందు ఐక్యమై పోవు ఉద్దేశ్యమును తెల్పుచున్నది.

ఇకపోతే జకాత్ యొక్క పద అర్థమును చూస్తే ఇట్లు చెప్పవచ్చును. జ+కాత్=జకాత్. జకాత్ రెండు శబ్దముల కలయిక. 'కాత్' అనగా ఎందుకు అనియూ, 'జ' అనగా పుట్టుటయనీ, మొత్తము కలిపి చూస్తే "ఎందుకు పుట్టాను?" అని ప్రశ్నింప చేయుచున్నది. అలా ప్రశ్న రావడము వలన తన పుట్టుకకు ఒక అర్థముండవలెనని, అదే దేవున్ని, దేవుని జ్ఞానము తెలియడమని గ్రహించి అప్పటినుండి దైవమార్గములో నడుచుటకు అవకాశమున్నది. జకాత్ పదమునకు సరిపోవునట్లు దేవునికి సేవ చేయు నిమిత్తము తనకున్న ధనములో కొంత దేవునికి ఉపయోగించును. అట్లు ధన రూపమున, వస్తు రూపమున దేవుని సేవ చేయడమును 'జకాత్' అని అనుచుందురు.

ప్రతి సంవత్సరము రంజాన్ నెలలో 30 దినములు ముస్లీమ్ లందరూ పవిత్ర దినములుగా భావించి పగలు పూట ఉపవాసముండుట చూస్తున్నాము. అలా గడుపడమును రోజా అని అంటున్నారు. రోజ అను రెండు అక్షరములను విడదీసి చూస్తే రో+జ అని విడిపోవును. అందులో "రో" అను అక్షరమునకు వివరమును చూస్తే ప్రతి రోజు లేక ప్రతి జన్మ అని అర్థము. "జ" అనగా పుట్టుట యని అర్థము. దీని మొత్తము అర్థమును గ్రహించితే వచ్చే ప్రతి జన్మ మంచి జన్మను కలుగజేయమని అర్థము గలదు.

ముప్ఫయి రోజులు ప్రతిదినము ఉపవాసముండి దేవుని జ్ఞప్తి కల్గియున్నట్లు, పుట్టబోయే ప్రతి జన్మ దేవుని ధ్యాస కల్గి బ్రతకాలని కోరుకోవడమని అర్థము. ముప్ఫయి దినములు రోజా ను భక్తి శ్రద్ధలతో ఆచరించడము వలన దాని ఫలితముగా రాబోయే జన్మలు మంచిగా దేవుని జ్ఞానము కల్గియుండునని అర్థము గలదు.

ఇక నాల్గవ దైవ ఆచరణ మక్కా యాత్రకు పోవడము. జీవితములో ఒక్క మారయినా మక్కా యాత్రకు పోయి రావలెనను నియమము కలదు. అలా మక్కా యాత్రకు పోయి కాబా గృహమును సందర్శించి రావడమును "హజ్" యని అంటారు. హజ్ అనగా దైవ జ్ఞానమును గల జన్మను ఇచ్చునదని అర్థము. హ+జ్ అను రెండు అక్షరములను కలిపితే "హజ్" అని చెప్పవచ్చును. ఈ పదములో కూడా ప్రత్యేకించి "జ" అను అక్షరముండుట వలన "జ" శబ్దము జన్మను లేక పుట్టుకను గురించి తెల్పునదిగా యున్నది. హజ్ పదములోని పూర్తి అర్థమును తీసుకుని చూస్తే 'మంచి జన్మను కలుగజేయి' అని అర్థము.

పెద్దల భావము ప్రకారము మంచి పని చేస్తే మంచి కర్మ, చెడుపని చేస్తే చెడు కర్మ యుండును. జకాత్ దానము చేయుట, ఉపవాసముండుట, యాత్ర చేయుట మంచి కార్యములగుట వలన వాటి వలన మంచి పుణ్యము లభించునని తెలియుచున్నది. పుణ్యము లభించుట వలన మనిషికి స్వర్గము లభించునని తెలియుచున్నది. ఈ మూడు కార్యములలో హజ్, రోజా రెండు మంచి పుణ్య కార్యములు కాగా, జకాత్ ఒక్కటి మాత్రము రెండు రకములు గలదు. ఇచ్చిన జకాత్ ప్రజలకు ఉపయోగపడితే దాని వలన పుణ్యఫలము వచ్చును. అలా కాకుండా ఇచ్చిన జకాత్ నేరుగా దేవుని

సేవకు ఉపయోగపడియుంటే దాని ఫలితముగా పుణ్యమురాదు. అది నమాజ్‌తో సమానమయిపోవును. నమాజ్ చేయగా మనిషికి వచ్చు ఫలితమే అటువంటి జకాత్‌లో యుండును. అందువలన జకాత్ రెండు రకముల ఫలితములను ఇచ్చునని చెప్పబడుచున్నది.

**ప్రశ్న: నమాజ్‌లో ఏ విధమైన ఫలితము వస్తున్నదో మాకు తెలుపమని కోరుచున్నాము. నమాజ్ చేయడము వలన పుణ్యము వస్తుందని, పుణ్యము వలన స్వర్గలోకము వస్తుందని, స్వర్గలోకములో ఎంతో సుఖముగా ఉంటామని ముస్లీమ్‌లందరూ చెప్పుచున్నారు. దానికి మీరేమంటారు?**

**జవాబు :-** నమాజ్, జకాత్ చేసిన వారిని అల్లాహ్ అంతిమదినములో స్వర్గలోకముకు పంపుననీ, నమాజ్, జకాత్ చేయక చెడుగా తిరిగిన వారిని అంతిమ దినమున లేపి అల్లాహ్ శిక్ష వేసి నరకమునకు పంపునని ముస్లీమ్‌లు చెప్పడము మేము విన్నాము. నమాజ్ జకాత్ సక్రమముగా చేసిన వారికి స్వర్గలోకములో అనేక సౌకర్యములు కలుగునని కూడా చెప్పగా విన్నాము. మనిషి స్వర్గలోక సుఖముల కొరకు ఆశపడి నమాజ్, జకాత్ సక్రమముగా చేయునని అలా చెప్పారో లేక నమాజ్, జకాత్ చేసిన వారికి నిజముగా స్వర్గలోకప్రాప్తి కలుగునో నాకు తెలియదు గానీ, నాలో తెలిసిన వాడిని అడిగితే అతను ఇలా చెప్పుచున్నాడు. "నమాజ్"ను మీరు ప్రతి దినము చేయుచున్నారు కదా! నమాజ్‌లో ఏదో ఒక వాక్యమును చెప్పుచూ నమాజ్ చేయుచున్నారు. ప్రతి నమాజ్‌లో కల్మా అను మంత్రమును లేక దైవ ప్రార్థనను చెప్పుచున్నారు. అలా ఒక పద్ధతిని అనుసరించి అందరూ నమజ్ చేయడము జరుగుచున్నది.

ఇంకా వివరముగా చెప్పితే ఖురాన్‌లోని మొదటి సూరా అయిన "అల్ ఫాతిహా" లోని ఏడు ఆయత్‌లను చదవనిదే అది నమాజ్ అనిపించుకోదు అని పెద్దల వాదన. ఫాతిహా సూరాలోని ఏడు వాక్యములు పూర్తి కానిదే నమాజ్ పుర్తికాదని చాలామంది చెప్పగా విన్నాము. ఇక్కడ మనిషి నడుస్తున్న మంచి దారినుండి ఇంకా మంచి దారిలోకి పోయేదానికి ప్రయత్నించాలి. ఒక ధర్మ సందేహము ఏర్పడినప్పుడు ధర్మములకు సంబంధించిన గ్రంథములనే చూడాలి. అంతిమదైవ గ్రంథము ఖురాన్ తనకంటే ముందు వచ్చిన దైవ గ్రంథములను అనుసరించే యున్నదని దీనిని గురించి ఖురాన్ గ్రంథములో సూరా 5, ఆయత్ 48లో కలదు **(5-48) "మేము నీ వైపునకు ఈ గ్రంథాన్ని సత్య సమేతముగా అవతరింపజేశాము. ఇది ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తున్నది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి (మనుషుల) మనోవాంఛలను అనుసరింపకు."**

తౌరాతు గ్రంథములో **"తపస్సుకంటే మించినది యోగము"** అని ఆత్మ సంయమ యోగము అను అధ్యాయములో చెప్పారు. అలాగే ఇంజీలు గ్రంథములో మత్తయి సువార్త **ఆరవ** అధ్యాయము **ఐదవ** వచనములో **(6-5) "రహస్య ప్రార్థన"**యని చెప్పియున్నారు. అంతేకాక ఖురాన్ గ్రంథములో సురా 4, ఆయత్ 103లో **"నమాజ్ తర్వాత అల్లాను స్మరిస్తూ ఉండండి"**యని తెల్పుచూ **"నమాజ్ విశ్వాసుల కొరకు విధిగా చేయబడినదని"** చెప్పారు. దానికి వివరముగా చూస్తే భయముగల స్థితిలో నిర్ధారిత సమయములలో చేయబడు నమాజ్ ఒక విధముగా కుదించబడిన నమాజ్‌యే అని కొందరు ముస్లీమ్ పెద్దలు చెప్పారు. ఇంకా కొందరు అల్లాహ్ జ్ఞానమును బాగా తెలిసిన వారు "నమాజ్, జకాత్, రోజా, హజ్‌వంటి

క్రియలు మాత్రమే ఆరాధనలు కావు. ఒకానొక ప్రత్యేక అస్తిత్వము ఎదుట అల్లాహ్‌ను అభ్యర్థించుకోవడమే నిజమైన ఆరాధనయగును" అని కూడా అన్నారు. ఈ విధముగా మూడు గ్రంథములను చూచిన తర్వాత నమాజ్ చేయడము విశ్వాసులలో ఒక నియమ నిబద్ధత ఏర్పరచటానికేనని, అసలయిన దేవుని ఆరాధనకు సమయ నియమము లేదని, అది మనిషి మనోభావమునకు అల్లాహ్ మీద అంటుకొనుయుండు భక్తి భావమనియూ, దానికి సమయమంటూ లేదని చెప్పారు. అందువలన మజీద్‌లో నమాజ్ అయిపోయిన తర్వాత మనస్సును అల్లాహ్ మీద లగ్నం చేసి యుంచమని ముస్లీమ్ పెద్దలు చెప్పి యుండగా, అప్పుడు కూడా ఫాతిహా సూరాలోని ఏడు ఆయత్‌లనే చదువవలెనని కొందరనుకొన్నారు. ఇమాం చెప్పు ఖురాన్ పఠనము మీద ధ్యాసపెట్టుకోవాలని కొందరనుకొన్నారు. వాస్తవానికి ఈ రెండు సరైన విధానము కాదని నమాజ్‌ను విధిగా చేసిన తర్వాత ఇంటిలోగానీ బయటగానీ, రాత్రిగానీ, పగలుగానీ, ఎక్కడయినా, ఏ సమయములో అయినా అల్లాను స్మరించుకోవడము నిజమైన అభ్యర్థన, నిజమైన ప్రార్థనయగును.

**ప్రశ్న :- ముస్లీమ్‌లు ప్రార్థనా మందిరములో చేయు నమాజ్ దేవుని ఆరాధన కాదంటారా?**

**జవాబు :-** నమాజ్ అంటే ప్రార్థన అని అర్థము. ప్రార్థన దేవుని ఆరాధనే అవుతుంది. అయితే నమాజ్ ఒక మంత్రము (మహిమగల వాక్యము) తో కూడుకొనియున్నది. దేవుడు నియమ నిబద్ధత లేనివాడు, అందువలన ఆయనను నియమిత సమయములో చేయు నమాజ్‌కే అంకితము చేయకూడదు. అందువలన సమయములలో కుదించబడిన నమాజ్ అని కొందరు పెద్దలు చెప్పారు. విశ్వాసుల కొరకు నియమ నిబద్ధతతో

కూడుకున్న నమాజ్ అందరూ విధిగా చేయవలసియుండగా, నియమ నిబద్ధత లేని ఏకాంత ప్రార్థన మనసుతో చేయవలసి యున్నదని, అది నమాజ్ అయిపోయిన తర్వాత అన్ని వేళల చేయవచ్చునని చెప్పారు. కల్మాతో కూడుకొన్న నమాజ్ తర్వాత కల్మాలేని మరో ప్రార్థనే నిజమైన నమాజ్‌గా ముస్లీమ్ పెద్దలు చెప్పియున్నారు.

ధర్మసమ్మతమైన అల్లా విషయములను ఒకరికొకరు చెప్పుకొని దైవ మార్గములో ముందుకు పోవుట తప్పుకాదు. అల్లా స్వయముగా విశ్వాసులను ఉద్దేశ్యించి సత్కార్యము, దైవభక్తికి సంబంధించిన విషయాలలో ఒకరికొకరు సహకరించుకోండి అని సూరా ఐదులో ఆయత్ రెండులో చెప్పియున్నాడు. అందువలన దైవమార్గములో ముందుకు పోవుటకు సమయానుకూలముగా చేయు నమాజ్‌కంటే, సమయ నిర్ణయము లేని అన్ని వేళల చేయు నమాజ్ అసలయిన నమాజ్ అని చెప్పుచున్నాము. దైవము (అల్లాహ్) మీద విశ్వాసము కలవారు సాధారణ నమాజ్‌ను నిర్ణీత సమయములలో చేయుచూ, అసాధారణ నమాజ్‌ను మనోభావముతో ఏ మంత్రముగానీ, ఏ వాక్యముగానీ లేకుండా చేయవలెను. అట్లు చేయుట వలన మొదట నమాజ్‌కంటే రెండవ నమాజ్‌కే అల్లాహ్ ప్రాధాన్యతనిచ్చును.

నిర్ణీత సమయములో చేయు నమాజ్ తపస్సు క్రిందికి జమ కట్టబడును. నిర్ణీత సమయము లేకుండా ఎల్లవేళలా చేయు నమాజ్ యోగము క్రిందికి లెక్కించబడును. భగవద్గీత (తౌరాత్) గ్రంథములో చెప్పబడినట్లు తపస్సుకంటే అధికమైనది యోగము అయినందున రెండవ నమాజ్‌కే దేవుడు ప్రాధాన్యత నిచ్చుట వలన రెండవ నమాజ్ వలన పరలోకము లభించును. మొదటి నమాజ్ వలన తపో ఫలితమైన పుణ్యము లభించి, దానివలన స్వర్గము లభించును. నమాజ్ దైవప్రార్థనే అయినా

రెండు రకముల ఫలితములను ఇచ్చుచున్నది. ఒకటి స్వర్గమును చేర్చగా, రెండవది దేవునివద్దకు చేర్చుచున్నది. స్వర్గమునకు, పరలోకమునకు ఎంతో తేడా గలదు. చాలామంది ముస్లీమ్‌లకు స్వర్గమును గురించి, అందులోని సుఖములను గురించి తెలియునుగానీ, పరలోకమును గురించి అందులోని దేవున్ని గురించి తెలియదు. మేము స్వర్గమునకంటే ఎక్కువ పరలోకమునకు విలువనిచ్చుచున్నాము కావున మిమ్ములను మొదటి రకము నమాజ్‌తోపాటు రెండవ రకము నమాజ్ కూడా చేయమన్నాను. నీ బుద్ధిని బట్టి నీవు నిర్ణయించుకోవచ్చునుగానీ ఇతరులు నిర్ణయించి చెప్పకూడదు. ఎవరి ఇష్టతనుబట్టి వారికి దేవుడు ఫలితమును ఇచ్చును.

**ప్రశ్న :- మీరు జబూర, తౌరాతు, ఇంజీలు, ఖురాన్ గ్రంథములను గురించి చెప్పుచూ జబూర గ్రంథము కాదు, అది జ్ఞానబోధ మాత్రమేయని చెప్పారు. అట్లే ఇంజీలును బైబిలు గ్రంథమని చెప్పారు. తౌరాతును ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతయని చెప్పారు. భగవద్గీతయనునది ఐదువేల సంవత్సరముల పూర్వము కృష్ణుడు అర్జునునకు చెప్పగా, దానినే వ్యాసుడు గ్రంథముగా వ్రాశాడని కలదు. కృష్ణుడు బోధ రూపములో చెప్పగా, దానినే ఆదియందు ఆకాశవాణి చెప్పినదని కూడా చెప్పాడు. ఆదిలో ఆకాశవాణి చెప్పిన జ్ఞానము భగవద్గీతయని కృష్ణుడు అనిన మాటలను బట్టి అర్థమయినది. అయితే వాణి ద్వారా వచ్చిన జ్ఞానము భగవద్గీతే అయినా అది కృష్ణుడు భగవంతుడుగా వచ్చి చెప్పుట వలన భగవద్గీతయని పేరు వచ్చినది. అంతకుముందు దానికి భగవద్గీతయను పేరులేదు. బోధ రూపములోయున్న ఆకాశవాణి జ్ఞానమునకు "జపర" అని పేరు యుండేది. జపర అనగా పుట్టుకకంటే వేరయినదని మీరే చెప్పారు. జపర జ్ఞానమే**

**భగవద్గీతగా గ్రంథ రూపమైనప్పుడు అది పుట్టినది భారతదేశములో చెప్పినవాడు కృష్ణుడు. వ్రాసినవాడు వ్యాసుడు అని అందరికీ తెలుసు. అయితే ఎక్కడో పడమటి దేశములో యున్న మూసా వ్రాసిన తౌరాత్ గ్రంథమునకు భగవద్గీతకు మీరు ముడిపెట్టి తౌరాత్ గ్రంథమే భగవద్గీత యని అంటున్నారు. మూసా ప్రవక్త మరియు అతని తౌరాత్ గ్రంథమునకు కృష్ణుడు చెప్పిన మరియు భారతదేశములో తయారయిన భగవద్గీతకు ఏమాత్రము సంబంధము లేదని ప్రత్యక్షముగా తెలియుచుండగా మీరు లేని విషయమును చెప్పితే మేము ఎలా నమ్మాలి? మీరు అనేక విషయములలో సత్యమునే చెప్పారని మాకు తెలుసు. మీరు జరుగబోయే కాలములో కూడా సత్యమునే చెప్పుదురని నమ్ముచున్న మాకు పూర్తి కనపడు అసత్యమును చెప్పడములో మీ ఉద్దేశ్యమేమిటి?**

**జవాబు :-** నా జీవిత కాలమంతయూ మీకు సత్యమునే చెప్పాలనునదే నా కోర్కె, అయితే నేను కోర్కె గల వాడినే గానీ దానిని నెరవేర్చువాడు నేను కాదు, నా లోని నా ఆత్మయే అని చెప్పుచున్నాను. శరీరములో నేను సత్యమునే చెప్పవలెనను అభిలాష కల్గియున్నా సత్యమును గానీ, అసత్యమును గానీ చెప్పువాడు ఆత్మయే. ప్రపంచ విషయములలో అసత్యమును, సత్యమును రెండు విధముల చెప్పు ఆత్మ దైవిక విషయములో సత్యమే చెప్పునని నాకు తెలుసు. అందువలన భగవద్గీత, తౌరాత్ అను విషయములలో సత్యమునే చెప్పునని అసత్యమును చెప్పడని చెప్పుచున్నానని చెప్పించువాడు ఆత్మయే. ఆత్మయే ఈ మాట చెప్పుట వలన నానుండి వచ్చు మాట నాది కాదనీ, ఆత్మదనీ, అదియే సత్యమని తెలియవలెను. మీకు ప్రత్యక్షముగా అసత్యమే కనిపించుచున్నదని చెప్పారు. మీకు కనిపించినది అసత్యముకాదనీ,

సత్యమేననీ తెలుపు బాధ్యత ఆయనదే (ఆత్మదే), కావున ఆయన ఏమి చెప్పుతాడో జాగ్రత్తగా విందాము.

మానవులతో సహా సమస్త జంతు, వృక్ష, క్రిమి, కీటక, లతాదులను మరియు దేవతలను సృష్టించిన సృష్టికర్త, అందరినీ పాలించు గ్రహములు, ఉపగ్రహములు, భూతములు, మహాభూతములను, ఉపభూతములను తయారుచేసి అందరికీ అవసరమైన తన జ్ఞానమును మహాభూతమైన ఆకాశవాణి ద్వారా చెప్పించాడు. అలా ఆకాశము ద్వారా చెప్పించడము వలన దేవుని పరిపాలనలో పాలకులుగా యున్న గ్రహములకు, ఉపగ్రహములకు, భూతములకు, ఉపభూతములకు, మహాభూతములకు ముందుగా తన జ్ఞానమును తెలియవలెనను ఉద్దేశ్యముతో చెప్పడము జరిగినది. అలా చెప్పిన జ్ఞానమును ముందు సూర్యగ్రహము విని అర్థము చేసుకొని తనకు అర్థమయిన జ్ఞానమును మిగతా గ్రహములకు భూతములకు తెలిపినది. ఆవిధముగా మొట్టమొదట దైవ పాలకులకు జ్ఞానమును అందించడము జరిగినది. దేవుడు సమస్త సృష్టిని తయారు చేసిన తర్వాత సృష్టియంతయు సజీవము కల్గియుండుటకు తన నుండి కొంత అంశను జీవునిగా తయారు చేసి అందరిలోనికి పంపడమైనది. అంతేకాక జీవునితో సహా అతనిని నడుపు ఆత్మను కూడా తన నుండి పంపడము జరిగినది. దేవుడు ఒక భాగము జీవుడుగా, ఒక భాగము ఆత్మగా విభజింపబడి సమస్త సృష్టికి జీవరూపమును కల్పించాడు. అలా దేవుడు మూడుగా చీలిపోవడము వలన దేవుడు దేవునిగానే యుంటూ తర్వాత ఆత్మ, జీవాత్మ అను రెండు భాగములుగా అయినాడు. దానితో జీవునికి క్షరుడు అనియూ, ఆత్మకు అక్షరుడని చెప్పిన దేవుడు తనను తాను ఆ ఇద్దరి పురుషులకంటే గొప్పవానిగా అర్థమగునట్లు తెలియజేయుచూ తనను పురుషోత్తముడని చెప్పారు.

సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా చెప్పిన జ్ఞానమును ఆకాశము అను భూతములో యున్న ఆత్మయే చెప్పింది. ఏ పనిని చేయవలసియున్నా దానిని ఆత్మే చేయునట్లు దేవుడు ముందే నిర్ణయించి యున్నాడు. తాను మాత్రము ఏమీ చేయక శరీరములో జీవాత్మ, ఆత్మలకు సాక్షిగా యున్నాడు. శరీరములలో దేవుడు సాక్షిగా యుండగా, ఆత్మ అన్ని కార్యములను చేయు కార్యకర్తగా యుండగా, జీవాత్మ జరిగిన పనుల వలన వచ్చిన ఫలితమును అనగా, సుఖదుఃఖములను అనుభవించుచుండును. శరీరములో జీవుడు చేతకానివాడై ఏ కార్యమును చేయడు. దేవుడు అన్నీ చేతనయినా తాను చేయక సాక్షిగా యుండును. జీవుడు, దేవుడు ఇద్దరు ఏ కార్యమును చేయకపోయినా, శరీరములోని ఆత్మమాత్రము సమస్తకార్యములను చేయుచుండును. సృష్ట్యాదిలో ఆకాశవాణి నుండి వచ్చిన దైవ జ్ఞానము ఖగోళములోని గ్రహములకు, భూతములకు చేరినదే గానీ భూమి మీద మనుషులకు ఏమాత్రము తెలియదు. దేవుని జ్ఞానము తెలియని దానివలన మాయ వలన కల్పింపబడిన యజ్ఞయాగాదులు, వేదపఠనములు, దానములు తపస్సులు దైవ జ్ఞానముగా మనుషులకు తెలియగా మనుషులు వాటినే గొప్పగా ఆచరించెడివారు.

దైవజ్ఞానము తెలియని దానివలన మాయ కల్పించిన వేద, యజ్ఞ, దాన, తపస్సులనే గొప్పగా ఆచరించుచూ అవియే దైవ ఆరాధనలని తలచెడివారు. ఆవిధముగా కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము గడచిపోగా అంతవరకు ప్రజలకు దేవుని జ్ఞానము గ్రంథరూపములో లేనిదాని వలన, త్రేతా యుగములో రావణ బ్రహ్మ దైవజ్ఞానమును చెప్పినా, అది గ్రంథరూపము కాకపోవుట వలన ప్రజలకు దైవ జ్ఞానమే తెలియకుండా పోయినది. ద్వాపరయుగము చివరిలో దేవుని అంశ కృష్ణ రూపములో

భగవంతుడై వచ్చి దేవుని జ్ఞానమును బోధించవలెనని తలచినది. అంతవరకు గ్రహములకు, భూతములకు పరిమితమైన దైవ జ్ఞానమే మనుషులకు కూడా అవసరమని తలచిన దేవుడు తానే భగవంతునిగా అవతరించి, కృష్ణుడు అనుపేరుతో భూమి మీద వుండి చివరికి మనిషికి జ్ఞానము చెప్పి దానిని మరొకరిచే గ్రంథరూపమగునట్లు చేశాడు. ఆ విధముగా తయారయినదే భగవద్గీత. భగవద్గీతను వ్రాసినది వ్యాసుడు, విన్నది అర్జునుడు, చెప్పినది కృష్ణుడు. భారతదేశములో ప్రజలకు జ్ఞానమును కృష్ణుడు చెప్పడమేకాక అది స్థిరస్థాయిగా నిలచునట్లు దానిని గ్రంథరూపముగా చేశాడు. దైవ జ్ఞానము మొట్టమొదటిసారి గ్రంథరూపమైనందున దానిని "ప్రథమ దైవగ్రంథము" అని చెప్పడమైనది. ప్రథమ దైవగ్రంథమును కృష్ణుడు అర్జుననకు చెప్పునప్పుడే **"ఈ జ్ఞానమును నేను సృష్టి ఆదిలో సూర్యునికి చెప్పియుంటిని, అదే జ్ఞానమునే ఇప్పుడు నీకు చెప్పుచున్నాను"** అని కూడా చెప్పాడు. దానివలన భూమిమీద ఎప్పుడు జ్ఞానము చెప్పబడినా సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే ఉండునని జ్ఞాపకముంచుకోవలెను. సృష్టియున్నంతవరకు దేవుడు ఒక్కడే, జ్ఞానము ఒక్కటే యుండునని తెలియవలెను.

భూమిమీదికి మొట్టమొదట గ్రంథరూపములో దేవుని జ్ఞానము రావడము వలన, మనుషులు జ్ఞానులుగా తయారగుటకు అవకాశము గలదు. అయితే అది భారతదేశమున సంస్కృత భాషలో వ్రాయబడిన గ్రంథమయినది. అందువలన ఒక్కమారుగా భారతదేశ ప్రజలందరూ తెలియుటకు అవకాశము లేకుండా పోయినది. సంస్కృత భాష వచ్చిన వారు వేల సంఖ్యలో తప్ప లక్షల సంఖ్యలో కూడా లేకుండా ఉండుట వలన అందరూ తెలియుటకు అవకాశము లేదనియే చెప్పవచ్చును. అప్పటి భారతదేశ జనాభా దాదాపు 20 కోట్లు కూడా లేదు. అందులో ఉత్తర దేశ

బ్రాహ్మణులు, పండితులు మాత్రము సంస్కృత భాషను నేర్చియుండిరి. వేదములను నేర్చుటకు సంస్కృత భాషను నేర్చుచుండిరి. అయితే అప్పటి కాశీ, బనారసీ బ్రాహ్మణులకు, కాశ్మీరు పండితులకు సంస్కృతము వచ్చినా వ్యాసుడు వ్రాసిన భగవద్గీతా జ్ఞానమునకు వారు కొంత వ్యతిరేఖులుగా యుండిరి. అందువలన వారు భగవద్గీత మీద అసూయను ప్రదర్శించు చుండిరి తప్ప ప్రచారము చేయలేదు. అంతేకాక వ్యాసుని మరణము తర్వాత కొందరు స్వార్థవరులు కొన్ని పదుల సంఖ్యలో తమకు అనుకూలమైన శ్లోకములను వ్రాసి భగవద్గీతలో కలిపియున్నారు. ఇదంతయూ సంస్కృతము రాని సాధారణ ప్రజలకు ఏమాత్రము తెలియదు. ఆ విధముగా కొంత రూపుమారిన భగవద్గీత నేడు మనముందర యున్నది.

**ప్రశ్న :- భగవద్గీతను మీరు తౌరాత్ గ్రంథము అని చెప్పారు కదా! దాని వివరము అడిగాము? మీరు దానిని చెప్పకుండా ప్రక్కదారి పట్టించి భారత దేశములోని భగవద్గీతను గురించియే చెప్పుచున్నారు. మాకు కావలసినది పడమటి దేశమయిన ఇజ్రాయేల్ దేశములో పుట్టిన తౌరాతు గ్రంథమును గురించి అడుగుచున్నాము?**

**జవాబు :-** తౌరాతు గ్రంథ విషయమును చెప్పుటకే ముందు భగవద్గీతా గ్రంథమును గురించిన ఉపోద్ఘాతమును చెప్పవలసి వచ్చినది. మీరు కనిపించు ఇల్లును గురించి అడిగారు. అయితే నేను పైకి కనిపించని పునాది దగ్గరనుండి చెప్పుచున్నాను. పైకి కనిపించే ఇల్లు ఎంతయుండినా దానికి తప్పనిసరిగా కనిపించని పునాది భూమిలో యుండును. ఇల్లు అంటే పైనుండియే లెక్కించకూడదు క్రింది పునాదితో సహా చూడవలసి యుంటుంది. తౌరాతు గ్రంథమును తెలియాలంటే దానికి కనిపించని

పునాదిగాయున్న భగవద్గీతను గురించి తెలియవలసి యున్నది. అందువలన భగవద్గీత ముందు ఎలా పుట్టినదో కొంత తెలియునట్లు చెప్పాము. చెప్పాము అని చెప్పుటకంటే 'చెప్పాడు' అని మీరు గుర్తుంచుకోవలెను. నేను చెప్పడము లేదు నా వెనుకయున్నవాడు చెప్పాడని మీరు మరువకూడదు. వ్రాసే భాషలో నేను అని చెప్పినా లేక మేము అని చెప్పినా, అలా భాషనుబట్టి వ్రాయవలసి వచ్చినా, మీరు మాత్రము మధ్యాత్మ మీద దృష్టిని పెట్టుకోవలెను. శరీరములోని జీవాత్మ చెప్పదు, పరమాత్మ మాట్లాడదు, మాట్లాడువాడు ఒక్క ఆత్మేనని మరువకూడదు.

తౌరాతు గ్రంథము పడమటి దేశమయిన ఇశ్రాయేలు దేశములోనే పుట్టినదని ఖచ్చితముగా చెప్పలేముగానీ, ఇశ్రాయేలు పరిసర ప్రాంతములో పుట్టినదని చెప్పవచ్చును. తౌరాతు గ్రంథము ఏ భాషలో ఉండినదో ఇప్పటికీ కూడా ఎవరికీ తెలియదు. తౌరాతు గ్రంథము భాష ఎలా తెలియదో అట్లే ఆ గ్రంథమును ఎవరు వ్రాశారో కూడా తెలియదు. అయితే కొన్ని విషయములను మాత్రము ఖచ్చితముగా చెప్పగలము. భారతదేశములో దాదాపు ఐదువేల సంవత్సరములప్పుడు భగవద్గీత గ్రంథరూపమైనది. సృష్టి ఆదిలో దేవుడు తన ఆత్మ ద్వారా ఆకాశమునుండి చెప్పించిన జ్ఞానమును భగవంతుని ద్వారా మనుషులకు చేర్చాడు. భగవంతుడు చెప్పిన జ్ఞానము అన్నట్లు అప్పుడు చెప్పిన జ్ఞానమునకు భగవద్గీత యని పేరు పెట్టి చెప్పడ మైనది. భగవద్గీత గ్రంథరూపము కానప్పుడు "జపర" అను పేరుతోయున్న జ్ఞానమే మొట్టమొదటి దైవగ్రంథముగా మారినది. మొదట సంస్కృత భాషలో వ్రాసిన భగవద్గీతను తర్వాత ఏ భాషలో వ్రాసినా అది ప్రథమ దైవగ్రంథముగానే యుండును. భగవద్గీత వ్యాసమహర్షి ద్వారా తయారయినా భారతదేశమునకు పడమర దిశలోయున్న ఇశ్రయేలు దేశ

ప్రాంతములోనికి భగవద్గీత చేర్చబడినది. ఆ ప్రాంత భాషలోనే ఆ ప్రాంతములోనున్న వ్యక్తి దగ్గరకు భగవద్గీతను చేర్చడమైనది. అప్పటికి భారతదేశములో సంస్కృత భాషలో తప్ప ఇతర భాషలో భగవద్గీత లేదు. కృష్ణుడు భారత యుద్ధములో చెప్పిన భగవద్గీతా జ్ఞానమును కృష్ణుని వయస్సు దాదాపు 90 సంవత్సరములప్పుడు అర్జునునికి చెప్పడమైనది.

దేవుడు లేక అల్లాహ్ లేక పరమాత్మ పథకము ఎలా వుండునో ఎవరికీ తెలియదు. ఆయన ముందే నిశ్చయించుకొన్న ప్రణాళికను బట్టి అంతయూ దానంతట అదే జరుగుచుండును. కృష్ణుడు మొత్తము 126 సంవత్సరములు బ్రతకడము జరిగినది. కృష్ణుడు చనిపోయినప్పుడు తన ఎదురుగా ఉన్న బోయవానికి జరుగబోవు కొన్ని విషయములు చెప్పి, తన రెండవ జన్మను గురించి కూడా చెప్పి చనిపోవడము జరిగినది. అలా చనిపోయిన కృష్ణుడు సాక్షాత్తు దేవుడే అయినా మానవునిగానే ప్రవర్తించాడు. చనిపోయినప్పుడు తిరిగి దేవునిగా మారిపోవలసిన ఆయన అలా మారిపోలేదు. ఇంకా కొంత కాలము మూడు ఆత్మలతోనే పని చేయాలను కొన్నాడు. తాను సృష్ట్యాదిలోని జ్ఞానమును భగవద్గీతగా భారతదేశమును ఎన్నుకొని భారతదేశములోని దక్షిణ ప్రాంతములో చెప్పాడు. అంతవరకు దేవుని జ్ఞానమునకు నిలయముగా యుండి, ఇందూ దేశమని పేరు గాంచిన భారతదేశములో ప్రణాళికబద్ధముగా జ్ఞానమును చెప్పి, అట్లే వ్యాసుని చేత గ్రంథరూపము చేయించాడు. అయితే భారతదేశములో పుట్టిన భగవద్గీత ఐదువేల సంవత్సరముల తర్వాత ప్రకాశించులాగున ఆయన నిర్ణయము జరిగినది. అప్పటి వరకు సురక్షితముగా యుండు దేశము భారతదేశమని తెలిసి భగవద్గీతను భారతదేశములోనే చెప్పడమైనది.

భారతదేశము దైవ జ్ఞానమునకు నిలయమనీ, అట్లే అజ్ఞానమునకు కూడా నిలయమని దేవునికి బాగా తెలుసు. తెలిసి ప్రపంచ దేశములు ఎన్ని యున్నా వాటిలో కాకుండా భారతదేశములోనే భగవద్గీతను చెప్పాడు. భారతదేశములో భగవద్గీత మసి గుడ్డలో చుట్టిన మాణిక్యములాగా ఉండునని, తిరిగి తాను వచ్చినప్పుడు తన భగవద్గీతను గురించి చెప్పినా తనను ఎవరూ గుర్తించలేరను ఉద్దేశ్యముతో సృష్ట్యాది జ్ఞానమును భగవద్గీతగా భారతదేశములో వుంచి కృష్ణుడు చనిపోయాడు. కృష్ణుడు చనిపోతూ బోయవానికి చెప్పిన విషయములు చాలా రహస్యమైనవి. ఇతరులకు తెలిసినా ఎవరూ నమ్మరను ధైర్యముతోనే బోయవానికి చెప్పిపోయాడు. ఆయన పోతూ ఇజ్రయేల్ దేశములో రాబోవు తన జన్మను గురించి తెలిపిపోవడమే కాక, దానికి తగిన ఏర్పాట్లను అప్పటినుండే ప్రారంభించినట్లు కొంత తెలియుచున్నది. కృష్ణుడు చనిపోయిన తర్వాత ఆయన మూడు ఆత్మలుగా మరికొంత కాలముండదలిచాడు అనుకొన్నాము కదా! అదేవిధముగా ఇజ్రయేల్ దేశ సమీపములోని ఒక వ్యక్తి శరీరములో ప్రవేశించి ఆ శరీరము ద్వారా తన భావములను కొన్నింటిని ప్రదర్శించాడు. ఇప్పుడు చెప్పు మాట నమ్మశక్యముగాని మాట. ఎవరూ నమ్మరను ధైర్యముతోనే ఆత్మ సత్యమును తెల్పుచున్నదని అనుకోగలము. అలా మానవ శరీరములో చేరిన కృష్ణ పరమాత్మ తొమ్మిది సంవత్సరములు ఆ శరీరములో గడుపడము జరిగినది. తర్వాత ఆ శరీరములో 135 సంవత్సరములప్పుడు చనిపోవడ మైనది. కృష్ణుడు 135 సంవత్సరములు బ్రతికాడనీ, కృష్ణశరీరములో 126 సంవత్సరములు జీవించగా, తర్వాత తొమ్మిది సంవత్సరములు అధికముగా ఉండుట వలన కృష్ణ జన్మ మొత్తము 135 సంవత్సరములు బ్రతికినట్లయి నది. 1+2+6 = 9 అయినప్పుడు కృష్ణ భగవానుడు శరీరమును వదలగా,

అదే సంఖ్య తొమ్మిది అయినప్పుడు అనగా 1+3+5 = 9 అయినప్పుడు కృష్ణుడు చేరిన రెండవ దేహమును కూడా వదలి పోవడము జరిగినది.

**ప్రశ్న :- కృష్ణుడు చనిపోయి సూక్ష్మ శరీరములో మరియొకని శరీరములోనికి చేరడము నమ్మశక్యముగాని మాటగా యున్నది. ఆయన పూర్తి మరణమును పొందలేదా? అకాలమరణమును పొందాడా? దయ్యము ఇతర మనుషులలో చేరినట్లు చేరవలసిన అవసరము భగవంతుడయిన కృష్ణునికి ఎందుకు వచ్చినది? మాలో యున్న అనేక సంశయములకు మీరు జవాబు చెప్పాలి?**

**జవాబు :-** కృష్ణుడు సాధారణమయిన మనిషి కాదు. ఆయన ప్రత్యేకముగా వచ్చిన భగవంతుడు. భగవంతుని శరీరములో మూడు ఆత్మలు యున్నా, ఆత్మ తనపని తాను చేసినా, జీవాత్మ అయినవాడు కర్మ లేనివాడు, ప్రత్యేకమైన వాడు. అతనికి అందరివలె మరణముండదు. 'జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల' యన్నట్లు ఆయనకు మరణములు వర్తించవు. అట్లే అందరివలె పుట్టుక కూడా వర్తించదు. తండ్రి వీర్య కణముతో సంబంధము లేకుండా పుట్టిన ఆయనకు అందరివలె పుట్టుక ఎట్లు లేదో అట్లే ఆయనకు అందరి వలె జీవుడు శరీరమును వదలి చనిపోవడము లేదు. ఆయన కర్మతో సంబంధము లేనివాడు. ఒక చోట చనిపోయి మరొకచోటికి పోవుటకు అతనికి కర్మలేదు. ఆయన స్వయం నిర్ణయము ప్రకారము పుట్టుక యుండును మరియు చావు వుండును. ఆయన ప్రస్థుతము భగవంతుడయినా ఆయనే మూడవ శక్తి అయిన పరమాత్మ (దేవుడు). అందువలన ఆయనను శాసించు శక్తి ఏదీ లేదు. ఆయన ధర్మసంస్థాపన కొరకు స్వయం నిర్ణయమును తీసుకొనును. భవిష్యత్తు ప్రణాళికను అనుసరించి ఆయన చేయు పనులుండును. తన రెండవ రాకను గురించి బోయవానికి కొంత

సమాచారమును తెల్పిన కృష్ణుడు, అదే సమాచార నిమిత్తము ఇస్రాయేల్ దేశ సమీపములోనున్న ఒక ప్రవక్త శరీరములోనికి ప్రవేశించాడు. అప్పటి కాలములో జ్ఞాన సమాచారమును అందించు వ్యక్తిని ప్రవక్త అనడము సహజము. అది కొంత జ్ఞానమయినా కావచ్చును లేక ఎక్కువ జ్ఞానమయినా కావచ్చును. మొత్తము మీద జ్ఞాన సమాచారమును అందించు ప్రవక్తగా యున్న వ్యక్తికి కృష్ణుని మరణ సమయమునకు అతని మరణము కూడా నిర్ణయింపబడియుండెను. అతని పేరు **"మోషే"** అని చెప్పబడుచుండెను. మోషే ప్రవక్త ఆ సమయమునకు చనిపోవునను విషయము కృష్ణునికి తప్ప ఎవరికీ తెలియదు. మోషేకు కూడా తెలియదు. మోషే సాధారణ మనిషే అయినందున తన మరణమును గురించి మోషేకు తెలియదు.

సర్వ సృష్టికర్తయిన అల్లాయే (దేవుడే) మోషేను ఆ ప్రాంతములో పేరుపొందిన ప్రవక్తగా చేసియుంచాడు. మోషే 54 సంవత్సరములు బ్రతికాడు. మోషే 54 సంవత్సరములు బ్రతుకునట్లు, మోషే చనిపోవు సమయమునకు కృష్ణుడు చనిపోవునట్లు ముందే నిర్ణయము జరిగినట్లు ఎవరికీ తెలియదు. కృష్ణునికి మాత్రము అన్నీ తెలిసే జరిగినవి. ఆయన స్వయముగా దేవుడే అయివున్నందున ఆయనకు అన్నీ తెలుసు. మోషే చనిపోయిన క్షణములోనే కృష్ణుడు చనిపోయి మోషే శరీరములో ప్రవేశించు నట్లు నిర్ణయించుకున్నాడు. మోషే ప్రవక్త చనిపోవడము, కృష్ణ భగవాన్ చనిపోవడము ఒకేమారు జరిగినది. కృష్ణుడు తన శరీరములో లేకుండా పోయి మోషే శరీరములో ప్రత్యక్షమయినాడు. అలా మోషే శరీరములో చనిపోయినట్లు ఎవరూ గుర్తించలేరు. మోషే చనిపోయినా అందులో కృష్ణుడు యుండుట వలన మోషే సాధారణముగా బ్రతికేయున్నాడని

అందరూ అనుకొన్నారు. కృష్ణుడు మోషేవలెనేవుండి జ్ఞానమును చెప్పుచుండుట వలన కృష్ణున్ని ఎవరూ గుర్తించలేదు, అందరూ మోషేనే మాట్లాడుచున్నాడని అనుకోవడము జరిగినది. కృష్ణుడు చనిపోయినట్లు భారతదేశములోనున్న వారికి తెలిసినా, అతను మోషేగా ఇతర దేశములో యున్నాడని మాత్రము తెలియదు.

**ప్రశ్న :- ప్రపంచములో ఎందరో ప్రవక్తలుండగా మోషే ప్రవక్త శరీరమునే కృష్ణుడు ఎందుకు ఎంచుకున్నాడు?**

**జవాబు :-** ఇది మంచి ప్రశ్నే. సమయానుకూలముగా అడుగవలసిన ప్రశ్నే. దీనికి నా జవాబు ఏమంటే కృష్ణుడు భగవద్గీతను చెప్పిన తర్వాత వ్యాస మహర్షి కృష్ణుడు చెప్పిన జ్ఞానమును గ్రంథరూపము చేయుటకు దాదాపు రెండు సంవత్సరములు పట్టినది. స్వచ్ఛమయిన కల్తీ లేని భగవద్గీత అప్పుడుండేది. వ్యాసుడు చనిపోయిన తర్వాత కొందరు స్వార్థవరులు వారి స్వార్థముతో కొన్ని శ్లోకములను కలుపడము జరిగినది. మొదట తయారయినది కలుషిత శ్లోకములు లేని భగవద్గీతగా యుండెడిది. కృష్ణుడు 90 సంవత్సరముల వయస్సులో అర్జుననకు సృష్ట్యాదిలోని జ్ఞానమును చెప్పగా, తర్వాత రెండు సంవత్సరముల కాలములో అది గ్రంథరూపముగా మారగా దాని పేరు 'భగవద్గీత' యని చెప్పుకొన్నాము. మోషే 54 సంవత్సరములు బ్రతుకగా, కృష్ణునికి 92 సంవత్సరముల వయస్సులో భగవద్గీత తయారయినది. భగవద్గీత తయారయిన సమయానికి మోషే వయస్సు సరిగా 20 సంవత్సరములుండును. 20 సంవత్సరముల తర్వాత 34 సంవత్సరములు మోషే బ్రతికాడు. అలాగే కృష్ణుడు కూడా 92 సంవత్సరముల తర్వాత 34 సంవత్సరములే బ్రతికాడు.

మోషేకు ఇరువది (20) సంవత్సరముల వయస్సులో ఒక శుభ దినము ఏర్పడినది. అప్పటినుండి మోషే అప్పుడప్పుడు కొంత జ్ఞానమును చెప్పుచూ మంచి వక్తగా మారిపోయాడు. తర్వాత ఆయనను ప్రవక్త అని అందరూ అన్నారు. 20 సంవత్సరములనుండి ఆయన జీవితములో ఒక క్రొత్త వెలుగు వచ్చినది. 92వ సంవత్సరములో కృష్ణునిలో కూడా ఒక తృప్తి ఏర్పడినది. అప్పుడు జరిగిన విశేషము ఏమి అనగా! మోషేకు 20 సంవత్సరములు గడచు కాలమున ఒక దినము ఆదివారము రాత్రి నడిరేయి గడచిన సమయములో స్వప్నము రావడము జరిగినది. ఆ స్వప్నములో కృష్ణుడు కనిపించి గ్రంథమైన తన భగవద్గీతను మోషేకు ఇవ్వడము జరిగినది. మోషే తన స్వప్నములో కృష్ణున్ని చూచినా కృష్ణుడు ఎవరో తనకు తెలియదు. అయితే స్వప్నములో కనపడిన కృష్ణుడు ఎంతో తేజస్సు కల్గియుండడమును చూచిన మోషే అతను నిజముగా దేవుడని నమ్మాడు. తేజస్సుతో కనిపించిన కృష్ణుడు మోషేకు భగవద్గీతా గ్రంథమును ఇచ్చి ఇది తౌరాత్ గ్రంథమని చెప్పడమైనది. మోషే స్వప్నములో గ్రంథమును తీసుకొని గుండెలకు హత్తుకున్నాడు. అంతే! అతని మెదడులో మెరుపు మెరిసినట్లయినది. మోషేకు ఒక్కమారుగా మెలుకువ వచ్చినది. మెలుకువ వచ్చిన తర్వాత కూడా గుండె వేగముగా కొట్టుకొనుచుండగా, తలలో ఏదో క్రొత్త అనుభూతిని పొందిన సంతోషము కల్గినది. జరిగినది ఏమిటి? అని కళ్ళు తెరచి చూడగా తన చేతులలో గ్రంథము కనిపించినది. అదియే తౌరాత్ గ్రంథము. దానిమీద అప్పటి భాషలో 'తౌరాత్' యని ఉండడమును మోషే చూచాడు. ఆ విధముగా మోషేకు తౌరాత్ గ్రంథము లభించినది. అక్కడి తౌరాత్ గ్రంథమే ఇక్కడి భగవద్గీత.

తౌరాత్ యనగా మూడు చీకటి రాత్రులని అర్థము. మూడు కనిపించని ఆత్మల యొక్క జ్ఞానముండుట వలన, మూడు ఆత్మల జ్ఞానము రహస్యమైనదయినందున, మూడు ఆత్మలనుద్దేశించి తౌరాత్‌యని భగవద్గీతకు కృష్ణుడే పేరు పెట్టాడని తెలియుచున్నది. ఇదంతా చదివే వారికి ఒక కథలాగ యున్నా, నమ్మశక్యముగానిదైయున్నా ఇది నూటికి నూరుపాల్లు జరిగిన సత్యము. నమ్మమని ఎవరినీ బలవంతము చేయడము లేదు. సత్యమును చెప్పక తప్పదు, కావున సమయము ఆసన్నమైనప్పుడు చెప్పక తప్పలేదు. అట్లని పైకి కనిపించు నన్ను ఈ విషయమునకు బాధ్యున్ని చేయవద్దండి. నిజముగా మీకు ఎంత తెలుసో నాకు అంతే తెలుసు. ఇప్పుడిది మీకే కాదు నాకు కూడా క్రొత్త విషయమే. ఇలా మనకు తెలియని ఎన్నో క్రొత్త విషయములు ఆత్మకు తెలుసు. ఆత్మ అందించితేనే ఇప్పుడు మనకు తెలియుచున్నది.

తౌరాత్ గ్రంథము మోషేకు లభించినదని తెలిసినది కదా! ఇక్కడే ఇంకొక క్రొత్త రహస్యము కలదు. అదేమనగా! తౌరాత్ గ్రంథమును మోషే తప్ప ఎవరూ చూడలేదు. తౌరాత్ గ్రంథము మోషేకు మాత్రమే కనిపించేది, ఇతరులకు కనిపించేది కాదు. ఆ విధముగా తౌరాత్ (భగవద్గీత) గ్రంథము అక్కడి మనుషులకు రహస్య గ్రంథమయినది. ఆ విషయము మోషేకు కూడా అర్థమయినది. గ్రంథములోని జ్ఞానమును రాత్రిపూట చదువుకొని పగలు ఇతరులకు చెప్పెడివాడు. చెప్పేది భగవద్గీతలోని జ్ఞానమయిన దానివలన శాస్త్రబద్ధముగా యుండెను. జ్ఞానమునకు గీటురాయిగా (సానరాయిగా) ఉండెను. తౌరాత్ జ్ఞానము వలన ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తేల్చిచెప్పుటకు వీలయ్యేది. అందువలన తౌరాత్ గ్రంథమునకు గీటురాయి అను పేరు సార్థకమయినది. అదే గీటురాయియే

మన వద్ద గల భగవద్గీత. ఆ దినములలో మోషేకు మాత్రము కనిపించి ఇతరులకు కనిపించని భగవద్గీత నేడు మనముందు జ్ఞానులకు, అజ్ఞానులకు కనిపించుచున్నది. నేడు గ్రంథము కనిపించినా అందులోని జ్ఞానము చాలా మందికి కనిపించడము లేదు. అనగా అర్థము కావడము లేదు.

మోషే చెప్పు జ్ఞానమునకు చాలా మంది ఆకర్షితులై ఆయన చెప్పు జ్ఞానమును తెలియుచుండిరి. మోషే తనకు తౌరాత్ గ్రంథము లభించినప్పటి నుండి 34 సంవత్సరములు గ్రంథములోని జ్ఞానమునే చెప్పాడు. మోషే చెప్పు జ్ఞానము తౌరాత్ గ్రంథములోనిదని ప్రజలకు తెలియదు. మోషేకు 54 సంవత్సరములు గడచిన తర్వాత మోషే శరీరములో లేకుండా పోవడమూ, అందులో స్వయముగా కృష్ణుడే ఉండడము ఇతరులెవరికీ తెలియదు. కృష్ణుడు తొమ్మిది సంవత్సరములు మోషే శరీరములో వుండి, మోషే చెప్పునట్లే నటించి రాబోయే ఏసును గురించి అతని జీవితములో జరుగు కొన్ని సంఘటనలను గురించి చెప్పడము జరిగినది. మోషే (కృష్ణుడు) చెప్పిన సంఘటనలు ఏసు జీవితములో నెరవేరినట్లు నాలుగు సువార్తలలో తెలియుచున్నది. మోషే ఏసును గురించి చెప్పిన కొన్ని సంఘటనలను తెలుసుకొన్న యెషయా అవే సంఘటనలనే తన లేఖనములలో వ్రాశారు. మోషే తౌరాత్ గ్రంథ జ్ఞానమును చెప్పుటవలన అతను ధర్మ శాస్త్రమును చెప్పాడని అందరూ అనుకోవడము జరిగినది. మోషే స్వయముగా ధర్మ శాస్త్రమును చెప్పాడని అనుకున్నారు. మోషేకు ఒక్కనికే తెలిసిన తౌరాత్‌ను మోషే తర్వాత ఎవరూ దానిని చూడలేదు. మోషే తప్ప తౌరాత్ గ్రంథమును చూచిన రెండవ వ్యక్తి లేడనియే చెప్పవచ్చును.

కృష్ణుడు మోషే శరీరములో తొమ్మిది సంవత్సరములుండి ఏసును గురించి ముందే చెప్పడము, ఆ విషయములను తర్వాత తెలిసిన ప్రవక్తలు

లేఖనములుగా వ్రాయడము జరిగినది. కృష్ణుడు 34 సంవత్సరముల ముందే భగవద్గీతను మోషేకు ఇవ్వడము వలన, అతని శరీరములోనికి వచ్చి మాట్లాడవలెనని నిర్ణయించుకొన్నాడు. మోషేలోయున్న తొమ్మిది సంవత్సరముల తర్వాత కృష్ణుడు శరీరమును వదలి మూడు ఆత్మలు ఏకమై దేవునిగా మారిపోయాడు. అదే దేవుడే మూడు వేల సంత్సరముల తర్వాత ఏసుగా రావడము జరిగినది. అయితే ఆయనను ఫలానా వాడని ఎవరూ గుర్తించలేక పోయారు. కొందరు దేవుని కుమారుడు అన్నారు. కొందరు దేవుని దూతయని అన్నారు. అంత తప్ప శరీరముతో వచ్చిన వాడే దేవుడని, ఎవరూ తెలియలేకపోయారు. ఏసు తర్వాత ఏసు చెప్పిన మాటలను బట్టి తయారయిన గ్రంథము ఇంజీలు. ఇంజీలు గ్రంథమును బైబిల్ గ్రంథమంటారు. ఇంజీలు గ్రంథము తౌరాత్ గ్రంథమును అనుసరించి తయారయినది. ఇంజీలులోని జ్ఞానము తౌరాత్‌లోని జ్ఞానమేయని చెప్పవచ్చును. ఈ విషయమును అంతిమ దైవ గ్రంథము ఖురాన్ సురా5, ఆయత్ 46లో కలదు. **(5-46) "మేము మర్యమ్ కుమారుడు ఈసాను (ఏసును) పంపాము. అతను తనకు పూర్వము వచ్చిన తౌరాత్ గ్రంథమును సత్యమని ధృవీకరించేవాడు. మేము అతనికి ఇంజీలు (బైబిల్) గ్రంథాన్ని ఇచ్చాము. అందులో మార్గ దర్శకము, జ్యోతి ఉండేవి. అది తనకు ముందున్న తౌరాత్ గ్రంథమును ధృవీకరించేది. అంతేకాక అది దైవభీతి కలవారికి మార్గదర్శినిగా ఉండేది"**

భారతదేశములో పుట్టిన భగవద్గీత ఇతర దేశములో తౌరాత్‌గా చెప్పబడినది. అయితే అది మోషేకు ఒక్కనికి తప్ప అందరికీ అందని

పండయినది. అందువలన తౌరాత్ గ్రంథము పేరు విన్నవారే గానీ దానిని చూచిన వారు ఎవరూ లేరు. ఇంజీలు గ్రంథములో తౌరాత్ జ్ఞానమున్నదని ఖురాన్ గ్రంథములో వ్రాయబడి యుండటము చూచాము. అంతేకాక తౌరాత్ గ్రంథము తర్వాత వచ్చిన ఇంజీలుకే కాక ఖురాన్‌కు కూడా ఆదర్శముగా యున్నదను విషయము అంతిమదైవ గ్రంథములోనే గలదు. సూరా 5, ఆయత్ 44ను చూడండి **(5-44) "మేము తౌరాత్ గ్రంథమును అవతరింపజేసాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. తౌరాత్ గ్రంథ ఆధారముగానే ముస్లిములయిన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు, యూదుల సమస్యను పరిష్కరించేవారు." (5-48) "మేము నీ వైపునకు ఈ గ్రంథమును (ఖురాన్) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తుంది. నీవద్దకు వచ్చిన సత్యమును వీడి వారి (మనుషుల) మనోవాంఛలను అనుసరించకు." (5-68) "మీరు తౌరాత్‌ను, ఇంజీలును (భగవద్గీత, బైబిల్) మీ ప్రభువు తరుపున మీ వద్దకు పంపబడిన ఖురాన్ గ్రంథమును మీజీవితాలలో నెలకొల్పువరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో వ్రాసిన వాక్యములను బట్టి తర్వాత వచ్చిన రెండు దైవ గ్రంథములలో మొదటి దైవగ్రంథము యొక్క జ్ఞానమే ఉందని అర్థమగుచున్నది. అందువలన మూడు దైవ గ్రంథములను చదవనిదే ఏ ధర్మములో లేనట్లేయని కూడా చెప్పారు. తౌరాత్ గ్రంథము యొక్క పేరును మోషే కూడా బయటికి చెప్పలేదు. అది రహస్యముగా నిలిచిపోయిన

గ్రంథమని చెప్పాడు. తౌరాత్ గ్రంథము మోషేకు ఇచ్చినప్పుడు గ్రంథము పేరు తౌరాత్‌యని మోషే విన్నాడు. ఆ గ్రంథము స్వప్నములో దొరికిన గ్రంథము. మోషేకు తప్ప ఇతరులకు కనిపించని గ్రంథము. బైబిల్‌ని గురించి మోషే ధర్మశాస్త్రమని చెప్పారు తప్ప పేరు చెప్పలేదు. అతి రహస్యమైన తౌరాత్ గ్రంథము పేరును ఖురాన్ గ్రంథము బయల్పరచినది. ఖురాన్ గ్రంథము తౌరాత్ గ్రంథము పేరును చెప్పకపోతే ఆ పేరు ప్రపంచానికి తెలిసేది కాదేమో! అయితే తౌరాత్ గ్రంథమే భగవద్గీతయని తెలియని రహస్యముగా యున్నది. సమయము ఆసన్నమయ్యే కొద్దీ తెలియని రహస్యములను ఆత్మే తెలుపవలసియున్నది.

**ప్రశ్న: అంతిమదైవ గ్రంథమయిన ఖురాన్‌లో తౌరాతు గ్రంథమును మూసాకు ఇచ్చినట్లు మహా జ్ఞాని జిబ్రయేల్ చెప్పాడు. మీరు బైబిల్‌లో ప్రవక్త అయిన మోషే పేరును చెప్పి తౌరాత్‌ను అతనికి అనుసంధానము చేశారు. ఖురాన్ గ్రంథములో మోషే పేరే లేదు, దీనికి మీరేమంటారు?**

**జవాబు :** ద్వితీయ దైవ గ్రంథమును ఖురాన్‌లో ఇంజీలు అని అన్నారు. ఇంజీలునే బయటి ప్రపంచములోని క్రైస్థవులందరూ బైబిల్ అని అంటున్నారు. ఖురాన్‌లో ఇంజీలు ఎట్లు బైబిల్‌గా పేరు మారినదో అట్లే బైబిల్‌లో మోషేగా చెప్పబడు వ్యక్తి ఖురాన్ గ్రంథములో మూసాగా చెప్పబడియున్నాడు. మోషే అనినా మూసా అనినా ఇద్దరూ ఒక్కడేనని తెలియవలెను.

**ప్రశ్న: మీరు చెప్పిన మోషే విషయమును, మోషేకి తౌరాత్ గ్రంథమును ఇచ్చిన విషయమును క్రొత్తగా విన్నాము. మీరు చెప్పినది చాలా రహస్యమైన విషయము. ఇది ఎవరి ఊహకు కూడా అందని విషయము. అంత పెద్ద రహస్యమును మీరు సులభముగా ఒక కథలాగా చెప్పారు. మీరు చెప్పినది**

**సత్యమే అయినా మాలో ఏదో అనుమానముగా యున్నది. ఆ అనుమానము కూడా తీరిపోవుటకు తగిన ఆధారము ఏమయినా ఖురాన్ గ్రంథములోగానీ, బైబిల్ గ్రంథములోగానీ యున్నదా?**

**జవాబు :-** భగవద్గీత (తౌరాత్) గ్రంథమును మోషేకు ఇవ్వడము జరిగినది గానీ, తౌరాత్‌లోని జ్ఞానమును నేరుగా అల్లాహ్ మోషేకు ఇవ్వలేదు. అందువలన నేను ఏ మానవ మాత్రుని మీద నా జ్ఞానమును అవతరింప జేయలేదు అని స్వయముగా దేవుడే చెప్పుచున్నాడు. ఈ విషయము మీకు తెలియాలంటే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా ఆరు, ఆయత్ 91లో వ్రాసిన విషయమును చూడండి. **(6-91) "దేవుడు ఏ మానవునిపైనా ఎలాంటి జ్ఞాన విషయమును అవతరింపజేయలేదు అని పలికినప్పుడు ఈ అవిశ్వాస జనులు దేవున్ని అర్థము చేసుకొవలసిన విధముగా అర్థము చేసుకోలేదు. వారిని అడుగు మూస తెచ్చిన తౌరాత్ గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి. మానవుల కొరకు మార్గదర్శకత్వము మీరు దానిని వేరు వేరు గ్రంథాలుగా విభజించి చూపుతున్నారు, ఎన్నో విషయములు దాచేస్తున్నారు. మీకు గానీ మీ పెద్దలకు గానీ తెలియని ఎన్నో విషయములు ఇందు మూలముగా మీకు నేర్పబడ్డాయి. తౌరాత్‌ను అవతరింపజేసిన వాడు అల్లాహ్‌యేనని చెప్పు. ఆ తర్వాత వాళ్ళను వారి వ్యర్థ విషయములలోనే ఆడుకోనివ్వు"** అని కలదు.

ఈ వాక్యమును చూస్తే దేవుడు తన జ్ఞానమును ఎవరి మీదా ప్రసరింపజేయలేదని అర్థమగుచున్నది. అంతేగాక ఇక్కడే మూసా తెచ్చిన

ఆ తౌరాత్ గ్రంథమును ఎవరు అవతరింపజేసినట్లు? అని ప్రశ్నించి దానికి జవాబును కూడా ఈ వాక్యములోనే తౌరాత్‌ను అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే (దేవుడే) యని చెప్పాడు. దీనిని బట్టి తౌరాత్ గ్రంథము మూసకి ఇయ్యబడినదిగానీ, అందులోని దేవుని జ్ఞానమును ఇవ్వలేదని, దేవుడే జ్ఞానమును తెలిసిన వాడని అర్థమగుచున్నది. మూస అనగా మోషేయని అర్థము చేసుకోవాలి. తౌరాత్ గ్రంథములోని జ్ఞానమును మూసా నేర్వగలిగాడు గానీ జ్ఞానము స్వయముగా ఆయనలో పుట్టలేదు. జ్ఞానమునకు పుట్టుక స్థానము దేవుడేయని ఈ వాక్యము ద్వారా అర్థమగుచున్నది. తౌరాత్ గ్రంథము జ్ఞాన జ్యోతియని, ప్రతి మానవునికి మార్గదర్శకమని కూడా ఈ వాక్యములోనే చెప్పాడు. అంతేకాక తౌరాత్ గ్రంథము (భగవద్గీత గ్రంథము) యొక్క జ్ఞానము వేరు వేరు గ్రంథములుగా యున్నదని అనగా బైబిల్, ఖురాన్ రూపములో యున్నదని చెప్పడమైనది. ఇదంతయూ మేము చెప్పిన విషయమునకు ఆధారము కాదా!యని తెల్పుచున్నాము.

ద్వితీయ దైవ గ్రంథముయిన బైబిల్‌ను పరిశీలించి చూస్తే మామాట సత్యమనుటకు ఆధారము దొరుకును. యోహాను సువార్త, ఆరవ అధ్యాయము 32, 33 వాక్యములను చూడండి (యోహాను 6-32, 33) **పరలోకమునుండి వచ్చు ఆహారము (జ్ఞానము) మోషేకు ఇయ్యబడలేదు. నా తండ్రియే పరలోకము నుండి వచ్చు నిజమైన ఆహారమును మీకనుగ్రహించుచున్నాడు. లోకమునకు జీవము (వెలుగు) నిచ్చునది దేవుడనుగ్రహించు ఆహారమై యున్నదని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.** ఈ వాక్యములను బట్టి చూస్తే మోషేకు ధర్మమైన జ్ఞానమును ఇయ్యలేదని, గ్రంథమును మాత్రము ఇచ్చాడని

తెలియుచున్నది. అంతేకాక మోషే శరీరములో కృష్ణుడు యున్న తొమ్మిది సంవత్సరములు ఏసును గురించిన సమాచారము చెప్పాడని విశ్వసించుటకు, మామాట సత్యమని నమ్ముటకు యోహాన్ ఐదవ అధ్యాయములో 46, 47 వాక్యములను చూడండి **(యోహాన్ 5- 46, 47) "అతడు నన్ను గురించి వ్రాసెను గనుక మీరు మోషేను నమ్మినట్లయిన నన్నును నమ్ముదురు. మీరు అతని లేఖనములను నమ్మని ఎడల నా మటలను ఎలాగు నమ్ముదురనెను."** ఈ వాక్యములను చూచిన తర్వాత ఇప్పుడు మాట్లాడే ఏసే, అప్పుడు మోషే శరీరములో యున్నట్లు అర్థము కాగలదు. మీరు మోషేను నమ్మితే నన్ను నమ్మినట్లే. ఆయనను నమ్మకపోతే నన్ను నమ్మనట్లే అనడములో ఇప్పుడు ఏసుగా వచ్చిన నతడు, అప్పుడు మోషేగా యున్ననతడు ఇద్దరు ఒక్కటేనని చెప్పకనే తెలియుచున్నది. అంతేకాక మోషే రూపములో యున్నప్పుడు భగవంతుడు చెప్పిన మాటలను తర్వాత ఇతరులు లేఖనములుగా వ్రాసిరని నేను చెప్పినమాట వాస్తవమనుటకు ఆధారముగా లూకా సువార్త 24వ అధ్యాయము 44వ వచనములో వ్రాసిన దానినిబట్టి తెలియుచున్నది. **(లూకా 24-44) "మోషే ధర్మశాస్త్రములోనూ, ప్రవక్తల గ్రంథములలోనూ, కీర్తనలలోనూ నన్ను గూర్చి వ్రాయబడిన వన్నియూ నెరవేరవలెనని నేను మీ యొద్ద ఉండినప్పుడు మీతో చెప్పిన మాటలు నెరవేరినవని వారితో చెప్పెను"** ఈ విధముగా బైబిలు వాక్యములను బట్టి, ఖురాన్ వాక్యములను బట్టి మా మాటలు వాస్తవమని నిరూపణకు వస్తున్నవి.

**ప్రశ్న :- భారతదేశములో ద్వాపర యుగమందు భగవద్గీత తయారయినది. భగవద్గీతను కృష్ణుడు చెప్పినప్పుడు అది సృష్ట్యాదిలోని జ్ఞానమని అర్జునునకు**

**జ్ఞానయోగమను అధ్యాయమున మొదటి శ్లోకమందే చెప్పియున్నాడు. మీ మాట ప్రకారము ఎప్పటికీ దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటేయుండు నని మాకు అర్థమయినది. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునకు 'జపర' అను పేరుండేదని దానినే ఖురాన్‌లో కొంతమార్పు చేసి 'జబుర' అను పేరుతో చెప్పారు. అట్లే మోషేను మూసా అన్నారని, బైబిలును ఇంజీలు అని చెప్పారని, ఏసును ఈసా అని చెప్పారని మీరు అనేక సందర్భములలో చెప్పారు. వాటిని కొంత తేడాతో చెప్పినా ఫరవాలేదుగానీ, దేవుని జ్ఞానమయిన భగవద్గీతకు ఎందుకు పేరు మార్చారు? మనుషులు మార్చి యుంటే ఇది మనుషులకు అలవాటే అని అనుకునేవారము. మనుషులు కాకుండా భగవంతుడయిన కృష్ణుడే తాను చెప్పిన భగవద్గీతకు తౌరాత్ యని పేరుమార్చి ఎందుకు చెప్పాడు? అలా చెప్పడము వలన దేవుని ఏకత్వము మీద అనుమానము కల్గుటకు అవకాశముండును కదా!యని ప్రశ్నించుచున్నాము?**

**జవాబు :-** మోషేను మూసాగా చెప్పడములో తప్పులేదు. కాలక్రమమున కొంత మార్పు జరిగియుండవచ్చును. బైబిలును ఇంజీలు అని చెప్పడములో సమస్యలేదు. ఏసును ఈసా అనియూ, జపరను జబూర అనియూ చెప్పడములో కాలక్రమములో మారియుండవచ్చునని అనుకోగలము. అయితే భగవద్గీత విషయములో కాలగమనము జరుగలేదు. చెప్పినది ఇతరులు కాదు భగవద్గీతయని భారతదేశములో పేరు పెట్టబడినప్పుడే అది ఇతర దేశమయిన ఇజ్రయేల్ ప్రాంతములోనికి చేర్చబడినది. అప్పుడు కాలగమనము కూడా జరుగలేదు. భగవద్గీతను చెప్పినవాడే పేరుమార్చి ఇవ్వడములో కృష్ణుడు ఉద్దేశ్య పూర్వకముగా పేరు మార్చాడని తెలియు చున్నది. అలా మార్చడములో ఆయన ఉద్దేశ్యము ఏమయివుండునని

ఆలోచించినట్లయితే భగవద్గీత జ్ఞానమే మోషేకు తెలిసినట్లు మోషేకుగానీ, ఇతరులకుగానీ ఎవరికీ తెలియకూడదనే కృష్ణుడు అలా చెప్పాడని అర్థ మగుచున్నది. మోషే వరకే తౌరాతు జ్ఞానముండి తర్వాత తెలియకుండా పోవలయునంటే భగవద్గీతయే తౌరాతు యని ఎవరికీ తెలియకూడదు. భగవద్గీత కలియుగములో ఐదువేల సంవత్సరములు గడచు వరకు ప్రకాశింప కూడదని ముందే దేవుని నిర్ణయముండుట వలన భగవదీత్గ జ్ఞానమిదియని తెలియకుండుటకు భగవంతుడు అలా పేరు మార్చి చెప్పడమైనది.

భగవద్గీతకు పేరులోనే భగవంతుడు గీచిన హద్దుయని అర్థముండగా, తౌరాతు గ్రంథమునకు కూడా పేరుకు తగిన అర్థమును చెప్పడము జరిగినది. తౌరాత్ అనగా మూడు రాత్రులని అర్థము. రాత్రి యనగా చీకటితో కూడుకొనియుండునదనీ, ఏమీ కనిపించని చీకటిని రాత్రియంటారని చెప్పుచూ, శరీరములోని మూడు ఆత్మలు ఎవరికీ తెలియకుండా యుండడము వలన మూడు ఆత్మలను ఉద్దేశించి మూడు రాత్రులని అర్థమొచ్చునట్లు తౌరాతు అని అన్నాడు. తౌరాతు అనగా మూడు తెలియని రాత్రులు లేక రాత్రులవలెయున్న మూడు తెలియని ఆత్మలు అని అర్థము. భగవద్గీత ముఖ్య ఉద్దేశ్యము క్షర, అక్షర, పురుషోత్తమ అను మూడు ఆత్మలు తెలియక యున్నవనీ, వాటిని తెల్పు నిమిత్తము అలా తౌరాత్‌యని అన్నారు. జీవాత్మ (క్షర), ఆత్మ (అక్షర), పురుషోత్తమ (పరమాత్మ) అను మూడు ఆత్మలు చీకటిలో యుండి కనపరానట్లు యుండుట వలన ఆ విషయము పేరులోనే అర్థమగునట్లు తౌరాత్‌యని చెప్పడమైనది. తెలియని ఆత్మలు మూడు యగుట వలన తౌరాత్ అని చెప్పారు. మూడు ఆత్మలను తెలియుటకు ఆత్మజ్ఞానము అనేది అవసరము. అలాగే మూడు ఆత్మలను మూడు రాత్రులుగా చెప్పుట వలన చీకటిని లేకుండా చేయుటకు

ఎట్లు వెలుగుచున్న దివిటీలు అవసరమో, అలాగే ప్రజ్వరిల్లుచున్న జ్ఞానము అజ్ఞానమను చీకటిని లేకుండా చేయుట అవసరము. అలా చేసినప్పుడు ఎవరికయినా మూడు ఆత్మలు తెలియును. అంతవరకు మూడు ఆత్మలు తెలియనివిగా యుండుట వలన వాటిని అర్థసహితముగా మూడు రాత్రులని అన్నారు. ఆ మాటలనే తౌరాత్ యని కూడా అన్నారు. దేవుడు శరీరమును ధరించి వస్తే భగవంతుడని పిలువబడును. అలాగే భగవంతుడు చెప్పినది మానవునికి హద్దులతో కూడుకొన్న జ్ఞానమగుట వలన, అదే అర్థముతో భగవద్గీతయని చెప్పడమైనది. భగవద్గీత ఐదువేల సంవత్సరములప్పుడు చెప్పినా నేటికీ ఎవరికీ తెలియకుండా ఉండిపోయినది. ఈ దేశములోనేకాక పరాయి దేశములో కూడా భగవద్గీతా జ్ఞానము తెలియకుండా యుండ వలెనను ఉద్దేశ్యముతోనే పేరుమార్చి చెప్పడము జరిగినది. ఇప్పటికి ఐదువేల సంవత్సరములు పూర్తి అయినందున భగవద్గీతా జ్ఞానము బయటికి రావలసి యున్నది. అందువలన తౌరాతుకు ఇప్పుడు అర్థము తెలిసినది.

**ప్రశ్న :- సమయము ఆసన్నమయినదని అంటున్నారు. దేనికి సమయము అని సంశయమేర్పడినది. సమయమాసన్నమయినదని మీరే చెప్పారు, కావున మీరే ఆ సమయము ఏదో చెప్పవలసియున్నది?**

**జవాబు :-** రత్నము తీసి మట్టిలో దాచిపెట్టి నేను బీదవానిని అయినప్పుడు రత్నమును తీసి ఉపయోగించుకుంటానని చెప్పినట్లు దేవుడు భగవంతుని రూపులో వచ్చి తన జ్ఞానమును భగవద్గీత గ్రంథముగా తయారు చేసి దానిని ఒక విధముగా పుట్టిన భారతదేశములోగానీ, పరిచయమయిన ఇజ్రయేల్ దేశములోగానీ తెలియకుండా చేశాడు. వాస్తవముగా భగవద్గీత జ్ఞానము భారతదేశములోనే ప్రచారము కాలేదు. భగవద్గీతకంటే ఎక్కువగా

వేదములు ప్రచారమయినవి. భగవద్గీత పేరుకు హిందువుల గ్రంథమని చెప్పినా, హిందువులలో భగవద్గీతను చూడనివారు సగానికంటే ఎక్కువే గలరు. దాదాపు 80 శాతము చదవని వారున్నారు. 20 శాతము మంది పూర్తి చదివిన వారు లేరు. కొద్దిగ చదివి మాకు అర్థము కాలేదని వదలి వేసినవారు పదిహేను (15) శాతము గలరు. మిగతా ఐదు శాతము మందిలో కొంతవరకు అర్థము చేసుకొన్న వారు రెండు శాతము మంది మాత్రమే గలరు. పూర్తిగా అసలయిన భావములో ఎవరికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. అటువంటి స్థితిలో భగవద్గీతయున్నది. అంతేకాక భగవద్గీతను చదవకూడదను చెప్పువారు కూడా కలరు. ఎవరయితే అంతో ఇంతో జ్ఞానులని మనము నమ్మామో వారే భగవద్గీతను చదువకూడదని చెప్పుచున్నారు. మరికొంతమంది జ్ఞానులవలె ప్రవర్తించువారు భగవద్గీతను ఇంటిలోనే పెట్టుకోకూడదు. ఇంట్లో భగవద్గీతయుంటే ఇంటిలో కష్టాలు ఉంటాయని భయపెట్టువారు కూడా కలరు. ఇంకా కొంతమంది సంస్కృతము రానిది భగవద్గీత చదువకూడదని చెప్పువారు కలరు. భగవద్గీత మీద అసూయను పెంచుకొని బయటికి తెలియకుండా మనుషులకు దానిని దూరము చేయువారు భారతదేశములో చాలామంది కలరు. ఇటువంటి స్థితిలో భగవద్గీత ప్రథమ దైవగ్రంథముగా తయారై ఐదు వేల సంవత్సరము లయినా భగవద్గీత నిజ భావము ఏమిటో ఎవరికీ తెలియలేదు.

నేడు భగవద్గీతా గ్రంథము అనేక భాషలలో వ్రాయబడినది. ఇతర దేశ భాషలలో కూడా అనువదింపబడినది. ఆ విధముగా దాదాపు మూడు వందల అరవై మంది భగవద్గీతకు వివరమును వ్రాశారు. వారిలో నేను ఒక్కనిని, నేను **"త్రైత సిద్ధాంతము"**ను ఆధారము చేసుకొని భగవద్గీతను వ్రాయడము జరిగినది. ఇంతవరకు ఎందరు వ్రాసినా భగవద్గీతను ఒక

సిద్ధాంతము మీద చెప్పలేదు. ఎవరి ఇష్టమొచ్చిన భావమును, ఎవరికి తోచిన భావమును వారు వ్రాయడము జరిగినది. అటువంటి స్థితిలో భగవద్గీత దేనికి మార్గదర్శకము కావలెనో దానికి మార్గదర్శకతను చూపలేక పోయినది. నేడు జ్ఞానులుగా సంస్కృత పండితులుగా యున్న స్వామీజీలు, సన్యాసులు ఎందరో తమ పాండిత్యమును ఉపయోగించి ప్రజారంజకముగా భగవద్గీతను వ్రాసి ప్రజల మెప్పును పొందారే తప్ప దేవుని మెప్పును పొందలేక పోయారు. ప్రజల వద్ద వారి పాండిత్యమును, వారి బుద్ధి ప్రతిభను చాటుకొనునట్లు భగవద్గీతను వ్రాశారే తప్ప ఈ శ్లోకమునకు మనము చెప్పు భావము సరియైనదేనా?యని ఒక్కరు కూడా ఆలోచించ లేకపోయారు. సర్వమానవులకు సమానముగాయున్న దేవుడు కులములుగా, తెగలుగా సృష్ఠించి కొందరిని దగ్గరగా కొందరిని దూరముగా పెట్టునా!యని ఆలోచించలేకపోయారు.

దేవుడు రూపము లేనివాడనని చెప్పినా దేవుని రూపమును వర్ణించి చెప్పడము తప్పుకాదా!యని యోచించలేకపోయారు. ఈ పనుల వలన నేను తెలియబడనని చెప్పినా ఆ పనులనే చేయాలని వ్రాయడము దేవునికి విరుద్ధ భావము కాదా!యని ఆలోచించలేకపోయారు. భగవద్గీతలో విగ్రహారాధన వలన దారితప్పిన వారగుదురని చెప్పినా, విగ్రహారాధనే ముఖ్యమని చెప్పడము దేవున్ని కించపరచినట్లు కాదా!యని తలచ లేకపోయారు. నన్నే పూజింపుము, నన్నే నమస్కరింపుము అని దేవుడు చెప్పగా, తనను పూజించమని చెప్పుకొను వారు దేవునికి వ్యతిరేఖముగా నడచువారు కాదా!యని ఏమాత్రము లెక్కించలేకపోయారు. ఏ కాలములో చనిపోతే మోక్షమునకు పోతావో, ఏ కాలములో చనిపోతే మోక్షముకు పోవో చెప్పెదనని ఆ కాలమును గురించి దేవుడు చెప్పియుండగా, దాని

భావమును పూర్తి మార్చి వ్రాసినవారు నరకమునకు తప్ప, వారిదారి వేరు లేదని గ్రహించలేకపోయారు. ఈ విధముగా చెప్పితే నేడు భగవద్గీత చాలామంది ప్రచారము చేయుచున్నారని చెప్పినా, భగవద్గీత చాలామందికి తెలిసిందని కొందరు చెప్పినా, అది యంతయూ కల్లయని ఇంతవరకు భగవద్గీత మనుషులకు దగ్గరయినట్లు కనిపించినా, అది దూరమవుచూ వచ్చినదని అర్థమయినది. మా మాట కొందరికి అసత్యముగా, నమ్మ శక్యముగాని విధముగా కనిపించినా చివరకు నేను చెప్పినదే సత్యమగును. ఇది గర్వముతో అహముతో చెప్పు మాటకాదు. దేవుని ఆజ్ఞయే అలాగున్నది. దేవుడు కొంత గడువును నిర్ణయించి, ఆ గడువు వరకు భగవద్గీత మట్టిలో మాణిక్యమువలె, మసిబట్టలో వజ్రమువలె కనిపించక యుండునట్లు నిర్ణయించాడు. ఆ నిర్ణయము ప్రకారము ఇంతవరకు భగవద్గీత బయటికి స్పష్టముగా కనిపించక మరుగున ఉండి పోయినది. ఇప్పుడిప్పుడు ఆ గడువు తీరిపోయినది. పోతులూరి వీర బ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"నందన నామ సంవత్సరమునుండి జ్ఞానము ప్రకాశించేను"** అని భవిష్యత్తును గురించి వ్రాసియుంచాడు. నందన నామ సంవత్సరము గడిచిపోయినది. ఇప్పుడిప్పుడే భగవద్గీత నిజ భావము బయటికి రాను మొదలు పెట్టినది. త్వరగా భగవద్గీత ప్రపంచమునకే పరిచయము కాగలదు.

**ప్రశ్న :- మీరు ఇంతవరకు క్రైస్థవము ఎట్లు హిందుత్వముతో అనుసంధానమై పుట్టినదో వ్రాశారు. హిందూ జ్ఞానమును బోధించిన భగవంతుడు క్రైస్థవ మతములోను తానే యున్నానన్నట్లు ముందే ప్రణాళికను అమలు చేసుకొన్నాడు. ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలోని జ్ఞానమే ఏసు బోధించాడని కూడా అర్థమగుచున్నది. అంతే కాక రెండు గ్రంథములలోనూ మొదటి గ్రంథమయిన తౌరాతులోని విషయములే యున్నాయని అంతిమ**

దైవ గ్రంథము చెప్పడము వలన మూడు గ్రంథములు ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధము కల్గియున్నవి. మూడు గ్రంథములు ఒకదానితో మరొకటి అనుసంధానమై యున్నా మూడు గ్రంథముల జ్ఞానమును అనుసరించు ప్రజలు వేరువేరు అభిప్రాయములు కల్గి మా దేవుడు అల్లాహ్, మీ దేవుడు ఎహోవా, ఇంకొకరి దేవుడు ఎవరో అన్నట్లు చెప్పుచూ, మా జ్ఞానము వేరు, మీ జ్ఞానము వేరు, మా ఆరాధనలు వేరు మీ ఆరాధనలు వేరని చెప్పుకోవడము, ఒకరి మీద మరొకరు అసూయకల్గి యుండడము నేడు జరుగుచున్నది. అంతిమ దైవ గ్రంథములో మూడు దైవ గ్రంథముల జ్ఞానము ఒక్కటే, మూడు గ్రంథములను చదివి, వాటిని అనుసరించకపోతే నీవు ఏ ధర్మములో (ఏ మతములో) లేనట్లేనని చెప్పియుంటే, ఆ వాక్యమును పెడచెవిన పెట్టి మూడు గ్రంథములను చదువవలెనని, మూడు గ్రంథములను ఒకే గౌరవముతో చూడవలెనని మనుషులు ఏమాత్రము అనుకోవడము లేదు.

దైవ గ్రంథములున్నా అందులోని జ్ఞానము మీద శ్రద్ధ చూపక బాహ్యాచరణ అయిన మతమును, దాని కట్టుబాట్లను తయారుచేసుకొని వారివారి మత కట్టుబాట్ల ప్రకారము వేషములోను, ఆచరణలోను ఎన్నో తేడాలు కల్గియున్నారు. తేడాలు కల్గియుండడమే కాక మన జ్ఞానము వేరు, ఇతరుల జ్ఞానము వేరని ఒకరునొకరు అసూయ కల్గి యున్నారు. దైవ గ్రంథములలో చెప్పని మతము మీద ఎక్కువ చింత కల్గి, దానిని అభివృద్ధి చేయాలని ప్రయత్నము చేయుచున్నారు. దైవ గ్రంథములయిన ఖురాన్‌ను ముస్లీమ్‌లు గొప్పగా గౌరవించుచున్నారు. అట్లే మిగతా మతముల వారు వారి గ్రంథములను గొప్పగా చెప్పుకుంటున్నారు. అయితే గ్రంథములోని

**సమాచారములో మతము లేకున్నా మనిషి మతమును ఎందుకు సృష్టించుకున్నాడు? మూడు గ్రంథముల జ్ఞానము తెలిసి మూడు గ్రంథముల ప్రకారము అనుసరించినప్పుడు నీవు ధర్మములో యున్నట్లు అని దైవ గ్రంథమయిన ఖురాన్‌లో చెప్పియుండగా మనుషులు ఆ మాటకు విలువనిస్తున్నారా? ఆ మాటను లెక్క చేయనప్పుడు దేవుని మాటను అతిక్రమించినట్లే కదా! దేవుని వాక్కును అగౌరవపరచినట్లే కదా! దైవ గ్రంథమునకు వ్యతిరేఖముగా ప్రవర్తించనట్లే కదా! ఇటువంటి అజ్ఞాన, అధర్మములతో కూడుకొన్న మనుషులు ఎప్పుడు సంస్కరించబడుతారు? ఎప్పుడు దైవ గ్రంథముల ప్రకారము నడువగలరు?**

**జవాబు :-** రోగము ముదిరి మందులతో నయము కానప్పుడు శస్త్ర చికిత్స అవసరమన్నట్లు, సమాజములోని మనుషులు పూర్తి అజ్ఞానములో కూరుకుపోయినప్పుడు వానిని దైవ గ్రంథములు కూడా బాగుపరచలేవు. తాను దైవ గ్రంథముల ప్రకారమే నడుస్తున్నాననుకొని, వాటికి వ్యతిరిక్తముగా నడుచువారున్నప్పుడు వారి తప్పు వారికి కనిపించదు. అందువలన మనిషి దైవ గ్రంథముల జ్ఞానముతో కూడా బాగు పడనప్పుడు దేవుడు తిరిగి అవతరించి తన ధర్మములను మనుషుల మధ్యలో నెలకొల్పి పోవును. ఈ విషయమును మూడు గ్రంథములలో చెప్పియున్నాడు. అయినా కొందరు మనుషులు మా మతములోని దేవుడు పుట్టడు, దేవుడు పుట్టువాడే కాదు అని మొండిగా వాదించుచున్నారు. అలా వాధించు వారి గ్రంథములలో దేవుడు అవతరిస్తాడని యున్నా, దానిని అర్థము చేసుకోలేని వారు, మా గ్రంథములో దేవుడు మనిషిగా పుట్టుదునని చెప్పలేదు అంటున్నారు. దేవుడు పుట్టడు అను వాదము ముఖ్యముగా ముస్లీమ్‌లలో ఎక్కువగా యున్నది. ముస్లీమ్‌ల మత గ్రంథముగా చెప్పబడుచున్న అంతిమ దైవ గ్రంథములో

అనేక చోట్ల దేవుడు అవతరిస్తాడని చెప్పడమే కాక, ఎట్లు అవతరిస్తానను విషయమును కూడా చెప్పాడు.

దేవుడు భూమి మీదకి వస్తే ఎవరికీ తెలియకుండా రహస్య జీవనము చేసి చివరకు తాను చెప్పవలసినది మనుషులకు చెప్పి పోవును. అయితే దేవుడు ఎప్పుడు భూమి మీదకి మనిషిగా వస్తాడని ఎవరికీ తెలియదు. వచ్చిన తర్వాత కూడా ఎవరూ భగవంతుని జన్మను గుర్తించలేరు. ఒకవేళ నేనే భగవంతున్ని, నేనే అవతరించాను అని చెప్పినా ఎవరూ వినే స్థితిలో యుండరు. అందువలన దేవుడు మనిషిగా వచ్చినా తన విషయమును ఎవరికీ తెలియకుండా తనపనిని తాను చేయుచూపోవును. అప్పుడు ఆయన చేయవలసిన కార్యములలో లేకుండా పోయిన ధర్మములను తిరిగి నెలకొల్పును. అధర్మములు ఇవియని చెప్పి వాటి దగ్గరికి ఎవరినీ పోకుండా చేయుట వలన అధర్మములు తగ్గిపోయి ధర్మములు పెరుగుచూ వచ్చును. దేవుడు మనిషి శరీరమును ధరించి భగవంతుడై వచ్చినప్పుడు ఆయన సాధారణ మనిషివలె యున్నా అతడు అందరిలాగ మనిషికాడు. ఆయన ప్రత్యేకమైన మనిషిగా యుండును. అందువలన ఆయనను మనిషి అనకుండా ప్రత్యేకమైన పేరుతో **"భగవంతుడు"**యని అంటున్నాము. భగవంతుడు భూమిమీదికి వస్తే ఈయన తురక భగవంతుడనో, క్రైస్థవ భగవంతుడనో, హిందూ భగవంతుడనో అనుటకు వీలుండదు. ఆయన ఒక మతమునకు సంబంధించిన వాడుగా యుండడు. అందువలన ఆయన అన్ని మతముల లోపములను బయటికి తీసి వాటిని సవరింపపూనును. అటువంటి పనులలో మత ఛాందస వాదులుగా యున్నవారు వచ్చిన భగవంతునితో వాదించి ఎదురింతురు. అయినా ఆయన భగవంతుడయిన దానివలన ఏ మతమువానికి ఆ మత గ్రంథములోనే సమాధానమును

చూపి నీ దేవుడు ఇలా చెప్పియుండగా నీవు వ్యతిరేఖముగా ప్రవర్తించు చున్నావు అని అడుగగలడు. వాని మతముతోనే వాని నోరును మూయించ గలడు.

అజ్ఞానము గల మనుషుల మధ్యలో భగవంతునికి కూడా కొన్ని ఇబ్బందులు, కొన్ని అవమానములు తప్పవు. అయినా ఆయన ఓపికగా వాటిని ఎదుర్కొని ముందుకు పోవుచుండును. భగవంతునికి ధర్మస్థాపనలో ఎంతటి అనానుకూల పరిస్థితులు ఏర్పడినా, వాటి బాధలకు ఓర్చుకొని జ్ఞాన మార్గమును ముందుకు విస్తరించుచూ పోవుచుండును. అట్లు ఒకమారు పూర్తి ధర్మసంస్థాపనము చేయుటకు ఆయన మూడుమార్లు, మూడు అవతారములుగా భూమిమీద పుట్టవలసి యుండును. నేడు అధర్మములు పెచ్చు పెరిగిపోయి ధర్మములు అడుగంటిపోయినవి. మతము అను అధర్మము కలియుగములో క్రొత్తగా పుట్టి అందరినీ తనవారిగా చేసుకొని ఆడించుచున్నది. మిగతా యుగములలోని అధర్మములకంటే నేడు ఎక్కువ ప్రభావము కల్గిన మతము అను అధర్మము ప్రపంచమంతా వ్యాపించి ఎనిమిది సంవత్సరముల పిల్లవానిలో కూడా చేరిపోయి తనకు ఏమాత్రము శత్రువు కానివానిమీద కూడా బుసలు కొట్టుచున్నది. నేడు మతమను అధర్మము వేయి చేతులు కల్గి అందరినీ తనవైపు లాగుకొను చున్నది. దేవుని మార్గమునకు పూర్తి మత అధర్మమే ఆటంకమైనది.

ఇప్పటికి భగవద్గీతను చెప్పినప్పటినుండి దేవుడు భగవంతునిగా రెండుమార్లు భూమిమీదికి వచ్చి మొదట ఒక్కనికే, ఎవరికీ తెలియకుండా, కొన్ని నిమిషములు మాత్రమే ధర్మములను తెలియజేసి పోయాడు. రెండవ మారు వచ్చినప్పుడు పదకొండుమంది శిష్యులకు మాత్రమే తన బోధను మూడు సంవత్సరములు మాత్రమే చెప్పిపోయాడు. మొదటిమారు

వచ్చినప్పుడు సృష్ట్యాదిలో సూర్యునికి చెప్పిన జ్ఞానమునే చెప్పి, దానినే భగవద్గీత గ్రంథముగా చేసి, రాబోయే కాలమునకని ఎత్తిపెట్టిపోయాడు. రెండవమారు భగవంతుడు వచ్చినప్పుడు చెప్పిన జ్ఞానమును బైబిలు గ్రంథముగా చేశాడు. మూడవమారు వచ్చి మూడవ గ్రంథమును చేస్తే భగవంతున్ని సులభముగా గుర్తుపట్టవచ్చును. అయితే ఆయన భగవంతునిగా రాకముందే మూడవ గ్రంథమును భూమిమీదికి పంపాడు. మూడవ గ్రంథమును తెచ్చినది, ఇచ్చినది సాధారణ మనిషి కాకపోయి నందున, ఆయన ఒక గ్రహము అయినందున ఆయనను భగవంతుడు అనుటకు వీలులేదు. అట్లని మూడవ భగవంతుడు రాడా!యని అంటే తప్పక వస్తాడు. ఆయన మూడుమార్లు అవతారములుగా వస్తే సంపూర్ణముగా ఒకమారు భూమిమీదికి వచ్చినట్లు ధర్మసంస్థాపన చేసినట్లయగును.

మూడవమారు వచ్చే భగవంతుడు పద్ధతి ప్రకారము మనిషివలె నున్న భగవంతునిగా రావలసియున్నది. అయితే ఇంతకు ముందు రెండు మార్లు భగవంతుడు వచ్చినప్పుడు మత ప్రసక్తే భూమిమీద లేదు. నేడు మతము అనకొండ పామువలె పూర్తి బలముగా యున్నది. ఆయన ఏ ప్రణాళికతో తన జ్ఞానమును చెప్పి మతమను అధర్మమును లేకుండా చేయునో చూడవలసియున్నది. దేవుడు అనుకొంటే ఏదయినా చేయగలడు. అందువలన ఈ మారు ఆయన చెప్పే బోధ భగవద్గీతవలె కొన్ని నిమిషములు, బైబిలువలె మూడు సంవత్సరములు కాకుండా, ఈ మారు చెప్పు బోధ 30 లేక 40 సంవత్సరముల పాటు ఏకధాటిగా బోధించవలసియుండును. అట్లయితేగానీ మతమౌఢ్యము మనుషులను వదలదు. ఎక్కడ ఏ గ్రంథములోనూ చెప్పని మతమనునది మనుషులనువారు తయారు చేసినదే.

తమ ఆధిపత్యమును పెంచుకొనుటకు ప్రజలనందరినీ తమ చేతిలో పెట్టుకొనుటకు పన్నిన పన్నాగమే మతము. మతము అనునది మత్తు మందులాంటిది. కొద్దిగ ఎక్కితే ఇంకా కొంచెము ఎక్కించుకోవాలను చింత తప్ప దీనినుండి తప్పించుకుందాము అను చింతయుండదు. అందువలన ఎవడయినా ఎంత తెలివైనవాడైనా ఒకమారు మతము అని దానియందు చిక్కుకొంటే తర్వాత దానినుండి బయటపడలేడు. అందువలన ఈ మారు భగవంతుడు మతము మీద ఎక్కువ దృష్టిని సారించి మతమును నిరోధించకుండా మతములను ఏకము చేయు ప్రయత్నము చేయును. అట్లు చేయుట వలన మనిషి మతములో ఉన్నట్లే భ్రమిస్తూ మతము నుండి బయటపడగలడు.

మనిషి ఎప్పుడు మతమునుండి బయటపడగలడో అప్పుడు అతనిలో మతద్వేషము పోయి అన్ని మతములు ఒక్కటేనను భావముకు వచ్చును. అప్పుడు మూడు దైవగ్రంథముల మీద గౌరవభావము ఏర్పడును. అలా గౌరవము ఏర్పడినప్పుడు మూడు గ్రంథములను అసూయ లేకుండా చదువ గలడు. అప్పుడు మూడు గ్రంథములలోని జ్ఞానము ఒక్కటేనని గ్రహించ గలడు. గీతలోని శ్లోకమునకుగానీ, బైబిలు వాక్యమునకుగానీ, ఖురాన్ ఆయత్‌లకు గానీ తప్పు భావము చేర్చకుండా సరియైన భావముతో చదువగలడు. ఎక్కడయినా తప్పు భావముండినా అది శాస్త్ర విరుద్ధముగా కనిపించుట వలన ప్రతి ఒక్కరు సరియైన అర్థము కొరకు అన్వేషింతురు. ఈ విధముగా భగవంతుడు మూడవమారు వచ్చుట వలన ఎవరికీ తెలియకుండానే ధర్మప్రతిష్టాపన జరిగిపోవును. మూడవ దైవగ్రంథము ఖురాన్ ముందే వచ్చియుండుట వలన ఈ మారు భగవంతుడు వస్తే దైవ గ్రంథము రాదు.

**ప్రశ్న :- మీరు మూడు మతములను ఒకే గాటిలోనికి తెస్తున్నారు. అందులో ఒక హిందూ మతము వారికి మాత్రము పునర్జన్మల మీద నమ్మకము గలదు. మిగతా రెండు మతములకు పునర్జన్మల మీద నమ్మకము లేదు. పునర్జన్మ వలననే పాపము అనుభవించవలసి వచ్చునని మీరు చెప్పుచున్నారు. పునర్జన్మ లేకుండా ప్రత్యేక స్వర్గ, నరకములకు పోయి అక్కడే స్థిరస్థాయిగా పుణ్యములనో, నరకములోనో ఉంటామని ముస్లీమ్‌లు అంటున్నారు. మీ లెక్కలో స్వర్గ, నరకములు అన్నీ ఇక్కడే భూమిమీదనే ఉన్నాయి. వారి లెక్కలో ప్రత్యేకమయిన లోకములలో ఉన్నాయి అంటున్నారు. అటువంటి వారికి మీరు ఏ విధముగా చెప్పగలరు? మీరు చెప్పినా వారు వినగలరా? వారి పెద్దలు చెప్పిన మాటలే పూర్తి సత్యములని నమ్ముచున్న వారికి వారి పెద్దలు చెప్పిన మాటలు అసత్యమని వారికి తెలిస్తే గానీ వారు మీ మాటలను వినరు. అటువంటి వారికి చెప్పాలంటే కష్టముగా ఉండును కదా! నూరు మందిలో ఒక్కడు నీ మాటను వినినా 99 మంది నీ మాటను వినకుండా మా పెద్దలు చెప్పినదే సత్యమని అంటారు. చాలా విషయములలో వారి పెద్దల మాట మీద నమ్మకముతో వారు చెప్పినట్లు నడుస్తున్నారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ప్రతి మనిషినీ సక్రమమయిన మార్గములో నడుపుటకు దేవుడు ముందే తన జ్ఞానమును తెలియజేసి దానిని భద్రముగా గ్రంథరూపములలో ఇచ్చాడు. అలా ఇచ్చినవే మూడు దైవగ్రంథములు. మూడు దైవగ్రంథముల లోనూ ఒకే దైవ జ్ఞానమున్నా వాటిని మూడు గ్రంథాలుగా చెప్పు కొంటున్నారు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 6, ఆయత్ 91 లో ఒకచోట **(6-91) "తౌరాత్ గ్రంథము ఒక జ్యోతి,**

**మానవుల కొరకు మార్గదర్శకత్వము. మీరు దానిని వేరువేరు గ్రంథాలుగా విభజించి చూపుతున్నారు, ఎన్నో విషయములను దాచేస్తున్నారు"** అని చెప్పడము జరిగినది. దీనినిబట్టి దైవజ్ఞానము ఒకటేయున్నా మీరు దానిని వేరువేరుగా చెప్పుకొంటున్నారని చెప్పాడు. అట్లు చెప్పుకోవడమేగాక ఎన్నో విషయాలను దాచేస్తున్నారని కూడా చెప్పాడు. ఈ తతంగమునంతటిని గమనించి చూస్తే, మతమునకు ఒక గ్రంథమున్నా మనిషికి ఒక గురువున్నాడు. మతము ఇచ్చిన గ్రంథములో మనిషికి కావలసిన మార్గమున్నా మనిషి స్వయముగా గ్రంథము చెప్పినట్లు నడుచుకోకుండా, మనిషి నమ్మిన గురువును అడిగి గ్రంథములో చెప్పినట్లు నడువవచ్చునా, నడువకూడదాయని తేల్చుకుంటున్నాడు. తమ మత పెద్దనో, తమ గురువునో విశ్వసించినట్లు గ్రంథమును విశ్వసించడము లేదు. ఒక మతములో దైవగ్రంథమున్నా వారు గ్రంథమును విశ్వసించక మతమునకంతటికి పెద్దగాయున్న తమ మత పెద్దమాటనే ఎక్కువగా విశ్వసించుచుందురు. కొన్ని మతములలో మనుషుల మీద అధికార మంతయూ మత పెద్దలే కల్గియుండి తమ ఆజ్ఞను బట్టి మతములోని మనుషులందరూ నడచుకొనునట్లు శాసించుచుందురు.

మతమునకు గ్రంథమున్నా అది దైవముతో సమానమైనా దానిని వివరించు చెప్పుదుమని కొందరు పెద్దలు తయారై వారు మతమును అంతటినీ తమ మాట మీద నడుపుచుందురు. గ్రంథములో కొన్ని మత పెద్దలకు నచ్చే విషయములున్నా, కొన్ని నచ్చని విషయములు కూడా యుండును. తమ ప్రవర్తనకు భిన్నముగా యున్న జ్ఞాన విషయములన్నీ మత పెద్దలకు నచ్చని విషయములుగా యుండును. అప్పుడు అటువంటి విషయములను దాచిపెట్టేసి చెప్పరు. ఎవరయినా ఆ విషయములను

అడిగినా ఆ విషయములను ఆచరించకూడదని, అవి దేవునికి సరిపడని విషయములని చెప్పి సరిచేయుదురు. దేవుడు గ్రంథములో ఈ పనిని చేయమని చెప్పియుంటే, కొందరు పెద్దలు ఆ పనిని చేయకూడదని ఆజ్ఞ చేయుచున్నారు. ప్రజలు తాము చెప్పినట్లు వినవలెనని ముందే చెప్పి నియమమును ఉంచినందు వలన ఆ నియమము ప్రకారము వారి పెద్దలు చెప్పిన మాటనే వింటున్నారు. దేవుడు చెప్పిన విషయము కనిపించినా చూడనట్లు వదలి వేయుచున్నారు. పెద్దలు చెప్పినట్లు వినుట "షరియత్" అని అంటున్నారు. ఇట్లు ముందే మనుషులు తమ మాటను వినునట్లు, తమకు జ్ఞానము అంతా తెలుసునన్నట్లు ప్రవర్తించుచుందురు.

ఒక దైవగ్రంథములో దేవుడు ఒకవైపుకు తిరిగి మ్రొక్కమని చెప్పాడనుకొనుము. అది దేవుని వాక్కు అందరికీ దేవుడు అమోద యోగ్యముగా, జ్ఞానమార్గములో ముందుకు పోవునట్లు చెప్పియుండును. అయితే ఆ దిక్కు తమ మత పెద్దలకుగానీ, తమ గురువులకుగానీ సరిపడ నివిగా యుండినట్లయితే ఆ దిక్కుకు తిరిగి మ్రొక్కకూడదని చెప్పుదురు. అప్పుడు తమ గ్రంథములోని మాటను విడచిపెట్టి తమ పెద్దలు చెప్పిన మాటనే మనిషి వింటున్నాడు. అట్లు వినడము నియమము అంటున్నారు. ఇక్కడ దేవుడు తన గ్రంథమును ఇచ్చి, దానికి దైవ గ్రంథమని పేరు పెట్టినా, దైవ గ్రంథములోని మాటకంటే మనుషుల మాటలే ముఖ్యమని మనిషి అనుకోవడము జరుగుచున్నది. అట్లు అనుకోకూడదు. మనుషుల భావమును బట్టి నీవు పోవద్దని దైవ గ్రంథమయిన ఖురాన్‌లో ఒక చోట చెప్పియున్నాడు చూడండి. సూరా ఐదు, ఆయత్ 48 **(5-48) "మేము నీ వైపుకు ఈ ఖురాన్ గ్రంథాన్ని సత్యసమేతముగా అవతరింప జేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని**

**ధృవీకరిస్తుంది. నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనో వాంఛలను అనుసరించకు"** అని ఉన్నది. ఇక్కడ వారి మనోవాంఛలను అని చెప్పడములో అర్థమును చూస్తే నీకు చెప్పు మనుషుల మాటలను వినవద్దని, వారి ఇష్టము ప్రకారము నీవు నడిస్తే తప్పు దారి పట్టి అసత్యమార్గములోనికి పోతావు అని ఇక్కడ దేవుడు హెచ్చరిక చేసి చెప్పాడు. అందువలన **"నీ వద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరించకు"** అని హెచ్చరించి చెప్పినట్లున్నది.

అయినా మనిషి దైవ గ్రంథములోని దేవుని మాటను వినకుండా మతపెద్దలనో, మత గురువులనో, గురువులనో చెప్పుకొను మనుషుల మాటలనే వింటున్నాడు. అలా వినుట వలన మనిషి కంటే దేవుడే చిన్న అయినట్లు నీవు చెప్పుకొను మనుషులే దేవునికంటే పెద్ద అయినట్లు లెక్కించుచున్నావని దేవుడు అనుకోవలసి వచ్చుచున్నది. మనిషి ఎప్పుడయినా దేవున్నే గొప్పగా నమ్మవలసియుండగా, అన్ని విధముల దేవుడే గొప్పగా యుండగా, దేవున్ని కాదని మా మతపెద్దలనీ, మా మత గురువులని చెప్పుకొనుచూ వారి మాటవింటే దేవున్ని మనిషి అవమానించినట్లుకాదా, జ్ఞానము తెలియవలసిన వాడు దేవున్ని గౌరవించవలెను. గౌరవముగా చూడవలెను. అట్లుకాకుండా దేవుడు చెప్పిన మాటలను, నిదర్శనాలను, సన్మార్గాలను దాచిపెట్టి ప్రజలకు తెలియకుండా చేసినా, ఒకవేళ ప్రత్యక్షముగా చెప్పియున్నా విషయమును కాదని అది ఆచరించకూడదని దేవుని మాటను కాదనినా, వారు దేవునికి శత్రువులతో సమానముకాదా! వారు ఏ విధముగా దేవున్ని గౌరవించినట్లు, దేవున్ని గొప్పగా చూసినట్లు? మేము జ్ఞానులమను గర్వముతోనో, మేము మత పెద్దలము, మత గురువులమను అహముతోనో,

తాము చెప్పినట్లే వినవలెనని చెప్పెడివారిని గురించి అంతిమ దైవ గ్రంథము ఖురాన్‌లో ఇట్లు చెప్పియున్నారు చూడండి.

సూరా 2, ఆయత్ 159 **(2-159) "మేము అవతరింపజేసిన నిదర్శనాలను మరియు సన్మార్గమును, ప్రజల కొరకు గ్రంథములో విశధ పరచిన తర్వాత కూడా వాటిని దాచిపెట్టే వారిని దేవుడు శపిస్తాడు. ఇంకా శపించే వారు కూడా వారిని శపిస్తారు"** అని కలదు. దేవుడు చెప్పిన ఈ మాటను తెలిసి కూడా తమ నియమమనీ, షరియత్‌యనీ ప్రజలకు చెప్పి, తమ మాటనే వినవలెనని భయపెట్టే వారిని దేవుడు శపిస్తాడని కలదు కదా! దేవుడు శపిస్తే దానికి తిరుగు యుండదు. తమ పెద్దరికము కొరకు దేవుని మాటను కాదని దేవుని శాపమును ఎందుకు పొందవలెను? దేవుని శాపము అంటే అంత సులభముగా ఉంటుందా! మీరే ఆలోచించుకోండి. ఘోరమైన నరకమును అనుభవించ వలసివచ్చునని మరువకూడదు. ఇంత కఠినముగా దేవుడు (అల్లాహ్) తన ఆయత్‌లో చెప్పియున్నా మనిషి ఆ మాటను లెక్క చేయక ఎలా ప్రవర్తిస్తున్నారో, ఖురాన్‌లోని దేవుని ఆయతులను ఎలా తప్పుదారి పట్టిస్తున్నారో తెలియుటకు ఉదాహరణగా అంతిమ దైవ గ్రంథము ఖురాన్‌లోనే ఒక ఆయత్‌ను తీసుకుని అందులో దేవుడు (అల్లాహ్) ఏమి చెప్పియున్నాడో, దానిని మనిషి ఎలా కాదని అంటున్నాడో ఒకమారు చూస్తాము.

సూరా15, ఆయత్ 29 మరియు 30లో ఇలా వున్నది చూడండి. (15-29, 30, 31, 32, 33) **"(29) నేను అతనిని పూర్తిగా తయారు చేసి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు, మీరంతా అతని ముందర సాష్టాంగపడండి. (30) దేవతలందరూ సాష్టాంగపడ్డారు.**

**(31) ఇక్కడ ఇబ్లీసు తప్ప సాష్టాంగపడే వారిలో అందరూ సాష్టాంగ పడినారు. (32) ఓ ఇబ్లీసు! సాష్టాంగ పడేవారిలో నీవ్వు ఎందుకు చేరలేదు? అని అల్లాహె (దేవ్వుడు) అడిగాడు. (33) కుళ్ళి ఎండిన నల్లటి మట్టితో నీవ్వు సృష్టించిన మనిషి ముందు నేను మోకరిల్లను"** అని తెగేసి చెప్పాడు. అని వ్రాయబడియున్నది. ఇక్కడ జరిగిన విషయ మేమంటే 26వ వాక్యములో మేము మనిషిని కుళ్ళి బాగా ఎండిన మట్టితో సృష్టించాము అనియుంది. ఇక్కడ ఈ మాటను బట్టి చూస్తే ఇంతవరకు సృష్ఠించిన మనుషలను నల్లని మట్టితో సృష్ఠించామని చెప్పాడు. అలాగే మనుషలంతా తయారయినారని దీని ద్వారా తెలియుచున్నది. 27వ వచనములో జిన్నాతులను అనగా దేవతలను తీవ్రమైన ఉష్ణజ్వాలతో సృష్ఠించాము అని చెప్పియున్నాడు. దీనిని బట్టి మానవుల సృష్ఠి ఒకరకము, దేవతల సృష్ఠి మరొకరకముగా యున్నదని, మునుషల శరీరాలను మట్టితో, దేవతల శరీరాలను జ్వాలతో సృష్ఠించానని చెప్పాడు. తర్వాత 28వ ఆయత్‌లో మట్టితోనే నేను ఒక మనిషిని సృష్ఠించబోతున్నాను అని ప్రత్యేకముగా దేవుడు చెప్పాడు. అలా చెప్పడము వలన మనిషివలెయున్న ఒక ప్రత్యేకమయిన వ్యక్తి (మనిషి) పుట్టుచున్నాడని ముందే తెలియజేశాడు. అతడు ప్రత్యేకత కల్గియుండుట వలన అతనిని దేవ దూతలందరూ నమస్కరించారు. దూతలు నమస్కరించారంటే వాడు దేవునితో సమానమైన వాడే అయివుండును.

ఇక్కడ మట్టితో తయారు చేసిన మనిషిలో నా ఆత్మను ఊదాను అని అల్లాహ్‌యే చెప్పియుండుట వలన వచ్చిన మనిషి అల్లాహ్ ఆత్మయేనని చెప్పవచ్చును. అల్లాహ్ ఆత్మయుండుట వలన ఆ మనిషిని ప్రత్యేకమయిన దేవుని అవతారమని చెప్పవచ్చును. దేవుడు పుట్టువాడు కాదు. ఎవరితోనూ నేరుగా మాట్లాడువాడు కాదు. అయితే ఆయన జ్ఞానము ఆయనకే తెలుసు.

అల్లాహ్ జ్ఞానము (దేవుని జ్ఞానము) దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియని దానివలన, దేవుని జ్ఞానము మనుషులకు తెలియాలంటే దేవుడు మనిషివలె మారువేషములో వచ్చినట్లు రావలసిందే. దేవుడు మనిషివలె వచ్చి మనుషులకు జ్ఞానమును చెప్పవలసియుండును. అలా దేవుడు మనిషి వలె వస్తే ఆయన సాధారణ మనిషికాడు. ఆయన ఇష్టము ప్రకారము వచ్చినవాడు అయినందున ఆయనను ప్రత్యేకమయిన పేరుతో భగవంతుడు యని అందురు. సామాన్య మనుషులు కర్మ ఆధీనములోయుండి కర్మ వలన పుట్టుచుందురు. పుట్టుకలో ఎవరి ఇష్టము పనికి రాదు. కర్మవలన మనిషి చంపబడుతున్నాడు. అలాగే కర్మవలన మనిషి పుట్టుచున్నాడు. మనిషి ఇష్టాయిష్టములతో చావు పుట్టుకలుండవు. మనిషికి బలవంతపు చావులు, బలవంతపు పుట్టుకలే యుండును తప్ప చావుగానీ, పుట్టుకగానీ మనిషి ఇష్టమొచ్చినట్లు ఉండదు. దేవుడు ఒక్కడే భగవంతునిగా తన ఇష్ట ప్రకారము పుట్టును, తన ఇష్ట ప్రకారము చనిపోవును. అటువంటి వాడు భగవంతుడయినందున భగవంతుడు దేవుని ఆత్మతో పుట్టినప్పుడు దూతలందరూ సాష్టాంగ నమస్కారము చేశారు. దేవదూతలు కనిపించే వారు కారు. అందువలన వారు భగవంతునికి నమస్కారము చేసిన విషయము మనకు తెలియదు. భగవంతున్ని నిత్యము కనిపించనివారు ఎందరో నమస్కరించుచుందురు. అయితే మనుషుల మధ్యలోయున్న భగవంతుడెవరో మనుషులకు తెలియుటకు అవకాశమేలేదు. అందువలన దేవుడయిన భగవంతుడు కూడా సాధారణ మనుషులలో కలిసిపోయి అందరి దృష్టిలో సాధారణ మనిషివలె లెక్కించబడుచుండును. ఆయన సాధారణ మనిషివలెయుండుట వలన ధనముకలవాడు, అధికారము గలవాడు మదముతో దేవుడయిన భగవంతున్ని కొన్ని సమయములలో దూషించు

చుందురు. భగవంతునికి సాష్టాంగ నమస్కారము చేయు దేవతను గొప్పగా మ్రొక్కువారు భగవంతున్ని దూషించడము చూచి, దేవతలే మనుషులు చేయు పాపమునకు ఆశ్చర్యపోవుచుందురు. అందువలన అదే దేవతలే మనుషులను కౄరముగా శిక్షించుచుందురు.

దేవుని ఆత్మే మనిషి రూపములో వస్తే, మనుషులలో గుణ మాయ ఆవహించి ఆయనను గౌరవించదు. మాయ చేత అజ్ఞానములో ఉంచ బడిన మనుషులు ఒక వ్యక్తి ప్రత్యేకముగా కనిపించినా, అతను దైవ గ్రంథమును బోధించుచున్నా, భగవంతునితో సమానముగా యున్నాడని కొందరు తెలిసిన జ్ఞానులు చెప్పుకొనుచుండినా, దేవుడే దిగివచ్చి ఇతను మనిషికాదు సాక్షాత్తు నా అవతారమేయని చెప్పినా, వారి మత నియమముల ప్రకారము మేము అల్లాహ్ తప్ప ఎవరికీ నమస్కరించము అంటున్నారు. శూన్యములో వున్న అల్లాహ్‌ను గాలిలో మ్రొక్కడము తప్ప ప్రత్యక్షముగా యున్న దేవుని అవతారమును మ్రొక్కకున్నారు. ఇతను నీకంటే గొప్పవాడే కదా! జ్ఞానములో దేవుని జ్ఞానమునే ప్రత్యక్షముగా చెప్పుచున్నాడు కదా!యని అడిగినా మా మత పెద్దలు మాటప్రకారము దేవుడే దిగి మా ముందరకు వచ్చినా మేము ప్రత్యక్షముగా ఎవరినీ మ్రొక్కము అని అంటున్నారు. అట్లు మ్రొక్కితే మా పెద్దల మాటను ధిక్కరించినట్లగునని చెప్పుచున్నారు. సూరా 5, ఆయత్ 48లో అల్లాహ్ ఆయత్‌లో మనుషుల మనోవాంఛల ప్రకారము నీవు నడువవద్దు అని చెప్పినా, మనుషులను పెద్దగా తలచి వారు దేవున్ని మ్రొక్కవద్దని చెప్పినా మ్రొక్కకున్నారంటే 48వ వాక్యములో దేవుడు చెప్పిన మాటకు వీరు విరుద్ధముగా ప్రవర్తించినట్లు కాదా? ఇట్లు దైవగ్రంథములోని మాటకంటే మత పెద్దల మాటలనే గొప్పగా ఆచరించు వారికి దేవుని జ్ఞానము ఎన్ని యుగములయినా తెలియదు.

దేవుని జ్ఞానము మూడు దైవగ్రంథములలో యున్నదని తెలియక, దైవగ్రంథములను ప్రక్కనబెట్టి మనుషులను గురువులుగా చేసుకొని, వారు చెప్పినట్లు చేయువారు ప్రతి మతములోనూ గలరు. మనుషులను గురువులుగా, పెద్దలుగా లెక్కించి దైవగ్రంథములోని దేవుని మాటలను విననివారు, అనుసరించనివారు తాము జ్ఞానులమనుకొనుచూ, కొంత కాలము గడువగా వారు కూడా గురువులుగా, సమాజ పెద్దలుగా తయారై వారి నియమముల ప్రకారము ప్రజలు నడువవలెనని చెప్పుచూ, మనుషులను మతానికొక్క వేషము, కులానికొక ఆచరణ అని ఏర్పరచారు. అందువలన హిందువులవలె క్రైస్థవులు కనిపించరు, క్రైస్థవులవలె ముస్లీమ్‌లు కనిపించరు. ముస్లీమ్‌వలె ఏ మతము వారు లేరు. మూడు మతములవారు ప్రత్యేక వేషధారణలో కనిపించుచున్నారు. వాస్తవముగా భగవద్గీతలోగానీ, బైబిలు గానీ, ఖురాన్ గ్రంథములోగానీ ఎక్కడయినా వేషధారణను గురించి ఒక్క మాటయినా కలదా? లేదు. మూడు దైవగ్రంథములో శరీరములోపల జ్ఞానమును గురించి చెప్పగా, మూడు దైవగ్రంథములలోని మాటలను మూడు మతములవారు లెక్కించక వారికి అనుకూలమైన ఉప గ్రంథములను వ్రాసుకొని వాటి ప్రకారము నడుస్తున్నారు. ఎవరయినా జ్ఞానమును గురించి ప్రశ్నిస్తే దైవగ్రంథములోని జవాబును చెప్పక, తమ ఉపగ్రంథములలోని జవాబులను చెప్పుచున్నారు. దైవగ్రంథములను సాక్షాత్తు దేవుడే అవతరింప జేయగా, ప్రతి మతములోని ఉపగ్రంథములను మనుషులు అవతరింప జేశారు. మనుషులు దేవుని పేరు చెప్పి తమ వ్రాతలను దైవ జ్ఞానముగా చూపుచూ ఎందరినో తప్పుదారిలో పంపుచున్నారు.

ఇటువంటి పరిస్థితి అన్ని మతములలో యుండుట వలన నేడు నేను చెప్పే దైవగ్రంథముల మాటను ఎవరూ లెక్కచేయరు. రేపు దేవుడు

వచ్చినా ఆయన మాటను వింటారను నమ్మకము కూడా లేదు. అయితే దేవుడు మనుషులకు తగిన ప్రణాళికను సిద్ధము చేసుకొని వచ్చును. మనవద్ద ఏ ప్రణాళికయుండదు. కావున మనము ఆయన ఆడించునట్లు ఆడేవారమే. నేను పుట్టినా రేపు దేవుడు భగవంతునిగా పుట్టినా ఏదో ఒక మతమునకు సంబంధించిన తల్లితండ్రులకు పుట్టవలసియుండును. అట్లు పుట్టిన వానిని ఆ మతస్థుడని ముద్రవేయడము జరుగుచున్నది. ప్రస్తుతము నేను హిందూ మతమునకు సంబంధించిన తల్లితండ్రులకు పుట్టాను, కనుక నన్ను అందరూ హిందూమతస్థుడని అనుచుందురు. అయితే నాకు యుక్తవయస్సు వచ్చు వరకు ఏ మత జ్ఞానము తెలియదు. హిందూ మత జ్ఞానము కూడా తెలియదు. హిందువులందరూ తమ మత జ్ఞానము కూడా తెలియకుండా బ్రతుకుచుందురు. నేను కూడా అట్లే బ్రతికాను. అయితే గత జన్మ సంస్కార బలము చేత ఒకమారు భగవద్గీతను చదివాను అప్పుడు భగవద్గీత బాగా అర్థమయినది. అందరికీ అర్థమయినట్లు కాకుండా ప్రత్యేకముగా అర్థమయినది. అలా అర్థమగుట వలన భగవద్గీత ఇప్పటి హిందువులందరికీ వ్యతిరేఖముగా యున్నట్లు అర్థమయినది. భగవద్గీత ప్రకారము హిందూ మతములో స్వాములు సహితము లేరన్నట్లు కనిపించినది. భగవద్గీత నాకర్థమయినట్లు ఇతరులకు ఎందుకు అర్థము కాలేదని ప్రశ్నగా మిగిలిపోయినది. తర్వాత చాలామంది వ్రాసిన భగవద్గీతలను చదివిన తర్వాత భగవద్గీతను వ్రాసిన వారికి కూడా అది సరిగా అర్థము కాలేదని అర్థమయినది. ఎందుకు ఇలా జరిగినదనీ కొంత కాలము యోచన చేసినా ఏమీ అర్థము కాలేదు.

భగవద్గీత నాకు అందరికంటే ప్రత్యేకముగా అర్థమయినదని తెలిసిన తర్వాత మిగతా బైబిలు గ్రంథమును చదవడమైనది. అందులో నాలుగు

సువార్తల జ్ఞానము ప్రత్యేకముగా కనిపించినది. నాలుగు సువార్తలలోనూ ఏసు జీవితము, ఆయన చెప్పిన మాటలు గలవు. ఏసు చెప్పిన మాటలు భగవద్గీతలో నాకు అర్థమయిన విధానము రెండు ఒకటేనని తెలిసినది. ఏసు చెప్పిన భావములు క్రైస్థవులకు కూడా గ్రహింపుకు రాలేదని, నాలుగు సువార్తలలో ఏసు చెప్పిన దానికి క్రైస్తవులు అర్థము చేసుకొన్న దానికి ఎంతో తేడా యున్నట్లు తెలిసినది. అప్పుడే బైబిలులోని ఏసు మాటలు క్రైస్థవులకు ఇంతవరకు తెలియలేదని చెప్పాము. భగవద్గీత హిందువులకు తెలియనట్లు, సువార్తల జ్ఞానము క్రైస్థవులకు కూడా తెలియకపోవడము నాకు ఆశ్చర్యమును కల్గించినది. తర్వాత వెంటనే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌ను చదువడమైనది. తెలుగులో వ్రాసిన ఖురాన్‌ను చదివిన తర్వాత ఖురాన్ అత్యంత రహస్య జ్ఞానమును చెప్పినట్లు అర్థమయినది. ఖురాన్ గ్రంథములోని వాక్యములు చాలా వరకు సూక్ష్మజ్ఞానముతో నిండుకొని యుండి పెద్ద రహస్యములను అర్థమగునట్లు చేసినవి. ఖురాన్‌లో అతి రహస్యముగా చెప్పిన జ్ఞానమంతయూ భగవద్గీతలో యుండడము, భగవద్గీతలోని జ్ఞానమే ఏసు మాటలలో యుండడము చూస్తే మూడు దైవగ్రంథములలో ఒకే దేవుని జ్ఞానమున్నదని తెలిసినది. నాకు అర్థమయినట్లు మూడు గ్రంథములు మూడు మతముల వారికి అర్థము కాకపోవడము, వారు వేరు భావములతో వాటిని చెప్పుకోవడము పూర్తి అజ్ఞానముగా కనిపించినది. సాధారణ మనుషులకు కాకుండా మత బోధకులకు, గురువులకు మూడు గ్రంథములు అర్థము కాకుండా పోయి, వేరు భావములో అర్థము కావడము చూస్తే, దేవుడే వారి శ్రద్ధనుబట్టి వారికి అర్థము కాకుండా చేసి అపమార్గమును పట్టించాడని అర్థమయినది. అదే మాటనే ఖురాన్ గ్రంథములో అల్లాహ్ కూడా చెప్పాడు.

మూడు మతముల గ్రంథములలో ఏకైక దేవుడు, ఏకైక జ్ఞానము ఉండగా మూడు మతములు మూడు మార్గములుగా పోవుచూ మా మతము వేరు, మీ మతము వేరనీ, మా దేవుడు వేరు, మీ దేవుడు వేరని ఎందుకు అనుచున్నారని ప్రశ్నించుకొని చూస్తే గ్రంథములలోని జ్ఞానము వారికి అర్థము కాలేదని తెలిసినది. ఎవరి శ్రద్ధనుబట్టి, ఎవరి భావమును బట్టి వారికి గ్రంథములోని జ్ఞానము అర్థమయిన దానివలన మూడు వేరు వేరు మతములుగా, మూడు వేరువేరు జ్ఞానములుగా వారికి తెలిసినట్లు, అందువలననే వారు ఒక్కొక్క మతమువారు ఒక్కొక్క దేవుని గురించి చెప్పుచున్నారని నాకు తెలిసినది. నాకు వారందరికంటే ప్రత్యేకముగా తెలిసినందుకు నేనేమి చేయాలను ప్రశ్న వచ్చినది. అప్పుడు దేవుని జ్ఞానములో ఉన్న సత్యమును తెలుపవలెనను సంకల్పము నాలో దేవుడు కల్గించాడు. దేవుని ఆజ్ఞ మేరకు నాకు తెలిసినంతవరకు దేవుని జ్ఞానమును ఇతర మతముల వారికీ, స్వమతము వారికీ తెలుపాలనుకొన్నాను. ఆ ప్రయత్నములో భాగముగా ఇప్పటికీ మతభేదము లేకుండా మూడు గ్రంథముల వాక్యములను కలిపి చెప్పుచూ దాదాపు 80 గ్రంథములను వ్రాయడము జరిగినది. భవిష్యత్తులో నూరు గ్రంథములను వ్రాయవలెనని దేవుని సంకల్పము.

దేవుని సంకల్పము నెరవేరునట్లు నేను నడుచుకోవడము నా ఆత్మ నడుపడము జరుగుచున్నది. దాని మూలముగా మూడు మతముల వారికి వారివారి గ్రంథములలోని జ్ఞానమునే వివరించి చెప్పుచున్నాము. అలా చెప్పడము వలన నా భావములు వారికి తెలియడము వలన ఇంతవరకు తెలియని జ్ఞానము వారికి తెలిసినట్లయినది. దానికి మూడు మతముల వారు నా దగ్గర సంతోషమును, సంతృప్తిని వ్యక్తము చేయుచున్నారు. వారి

సంతోషమును చూచి వారి పెద్దలు చెప్పని రహస్యములను దేవుడు నా చేత చెప్పించినందుకు నాకు సంతోషము కలుగడమేకాక రెట్టింపు ఉత్సాహము కల్గి ఇంకా ఎన్నో విషయములను తెల్పుటకు కారణమైనది. కాలము గడుచుకొలది జ్ఞానములో ఎవరికీ తెలియని రహస్యములు నా ద్వారా ఆత్మ బయటపెట్టడము ఇతరులకు జ్ఞానము తెలియడమే కాక నాకు కూడా ఎంతో క్రొత్త జ్ఞానము తెలిసినట్లయినది. ఇట్లు నిత్యము జరుగవలెనని కోరుకొంటున్నాను. అట్లే దేవుడు నెరవేర్చుచున్నాడు.

**ప్రశ్న :- మీకు జ్ఞానములో ఎంత క్రొత్త భావములు తెలిసినా ఒక్కొక్క మతము ఒక్కొక్క త్రాటికి కట్టివేయబడి ఉన్నాయి. హిందువుల భగవద్గీత ప్రకారము పునర్జన్మలున్నాయి అని అంటున్నారు. ముస్లీమ్‌లు ఖురాన్ ప్రకారము పునర్జన్మలు లేవు అంటున్నారు. జన్మలున్నాయని చెప్పడము హిందువుల మతధ్యేయము కాగా, జన్మలు లేవు అని చెప్పడము ముస్లీమ్‌ల మత నిర్ణయముగా యున్నది. జన్మలున్నాయి, జన్మలు లేవు అను రెండు విషయముల మధ్య పెద్ద అగాధమున్నట్లు గలదు. జన్మలు లేవు అను విషయము ముస్లీమ్‌లలో పుట్టుకతో నూరిపోసిన ఉగ్గులాగయున్నది. అటువంటప్పుడు మీరు ఏమి చెప్పినా జన్మలున్నాయని చెప్పునప్పటికీ ముస్లీమ్‌లందరూ నిన్ను విభేదించి ముక్తకంఠముతో జన్మలు లేవనియే చెప్పుదురు. మీరు మిగతా మతస్థులకు ఏమి చెప్పారో, వారు ఏమి విన్నారో మాకు తెలియదు గానీ, మీరు ముస్లీమ్‌లచేత జన్మలున్నాయని ఒప్పించగలరా? వారు ఒప్పుకుంటారా? చెప్పండి.**

**జవాబు :-** ఒప్పించడానికి నేనెవరిని, వారి దృఢమైన భావమును వారి నుండి తీసివేయుటకు నేను చేతకానివాడినే గానీ, అందరిలో యున్న ఆత్మ

అనుకొంటే ఏమయినా చేయగలదు. ఒకరోజు ఒక ముస్లీమ్ పండితుడు నాతో కలువడము జరిగినది. అతని పేరే రబ్బాని అనివుంది. రబ్బాని అంటే జ్ఞానములో పండితుడని అర్థము. వారిని పునర్జన్మ విషయమై నేను అడగడము ఆయన జవాబు చెప్పడము జరిగినది. ఆ సంభాషణ క్రింది విధముగా ఉంది చూడండి.

**నేను :-** రబ్బానీగారు! మీరు ఇస్లామ్ జ్ఞానములో పండితులని విన్నాము. నాకు అంతిమ దైవగ్రంథములో పునర్జన్మల విషయమై సంశయము కలదు. మీ అనుభవ జ్ఞానరీత్యా ఖురాన్ గ్రంథము పునర్జన్మలను సమర్థించుచున్నదా? పునర్జన్మలను లేవని ఖండించుచున్నదా?

**ఆయన :-** నా అనుభవ జ్ఞానమే కాదు, ముస్లీమ్ జ్ఞానములో ఎక్కడా పునర్జన్మలున్నట్లు లేదు. ఒక మనిషి బ్రతికినంత కాలము బ్రతికి చనిపోయిన తర్వాత ఒక దినము అతని పాపపుణ్యముల చిట్టాను అల్లాహ్ చూచి అతను చేసుకొన్న దానినిబట్టి వానిని నరకానికి పంపవలెనా? లేక స్వర్గానికి పంపవలెనా?యని నిర్ణయించి, వానిని స్వర్గానికో నరకానికో పంపడము జరుగుచుండును. అలా స్వర్గనరకములకు పంపడము తప్ప తిరిగి జన్మలకు పంపడము మా ఖురాన్ గ్రంథములో లేదు.

**నేను :-** ఖురాన్ గ్రంథమును మేము రెండుమార్లు చదివాను. అందులో కొన్ని దైవ వాక్యములయిన ఆయత్‌లను చూచినప్పుడు పునర్జన్మలున్నట్లు అర్థమయినది. అవి ఇలా యున్నవి. (సూరా 53, ఆయత్ 44, 45,46, 47). **(44) "నిశ్చయముగా ఆయనే మరణింపజేసేవాడు, తిరిగి జీవితాన్ని ప్రసాదించేవాడు. (45) నిశ్చయముగా ఆడ మగ జంటలను సృష్టించిన వాడు ఆయనే. (46) ప్రవహింపజేసిన**

**(విసర్జింపబడిన) వీర్య బిందువునుండి (47) మరొక జీవితమును ప్రసాదించడము ఆయనకే చెల్లును"** అని కలదు. అంతేకాక **(సూరా 7, ఆయత్ 29) "మొదటిసారి మిమ్మల్ని అల్లాహ్ ఎలా పుట్టించాడో మలిసారి కూడా మీరు అలాగే పుట్టించబడతారు"** అని కలదు. దీని అర్థము మొదట జన్మవలె రెండవ జన్మయున్నదనేగా అర్థము. వీర్య బిందువుతో పుట్టేది జన్మే కదా! మరొకచోట **(సూరా 36-68) "మేము వృద్ధాప్యానికి చేరిన వారిని మళ్ళీ జనన స్థితికి తీసుకుపోతాము. అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి?"** ఇక్కడ అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి? అని ముస్లీమ్‌లను ఉద్దేశించి అల్లాహ్ అన్నట్లు నాకు అర్థమయినది. ముసలి వాళ్ళు తిరిగి పిల్లలుగా పుట్టించువాడు దేవుడేయని పై ఆయత్‌లో తెలియుచున్నది. ఇంకొక చోట **(సూరా 40, ఆయత్ 11) "మా ప్రభూ! నీవు మాకు రెండుసార్లు చావునిచ్చావు, రెండుసార్లు బ్రతుకునిచ్చావు. ఇప్పుడు మేము మా పాపాలను ఒప్పుకుంటున్నాము. మరి ఇప్పుడు మేము బయటపడే మార్గము ఏదైనా ఉందాయని విన్నవించుకుంటాము"** అని కలదు. ఇవన్నియూ చూచిన తర్వాత మాకు ఖురాన్ గ్రంథము జన్మలున్నట్లు తెలియజేసిందని అనుకుంటున్నాము, మీరేమంటారు?

**ఆయన :-** ఎక్కడో ఏదో ఒకటి రెండు ఆయత్‌లను తీసుకొని వాటిని సరిగా అర్థము చేసుకోలేక జన్మలున్నాయనడము ఒప్పుకోదగిన విషయము కాదు. మీరు సరిగా అర్థము చేసుకోలేదు.

**నేను :-** "అంతిమ దైవ గ్రంథము ఖురాన్" అను తెలుగు గ్రంథములో (అహ్‌సనుల్ బయాన్) అను గ్రంథములో **53వ సూరా, 46వ ఆయత్‌లో (53-46) "గర్భములో కార్చబడినప్పటి వీర్యపు బిందువుతో (47) "మలిసారి బ్రతికించి లేపే బాధ్యత కూడా ఆయనదే"** అని కలదు. స్వచ్ఛముగా వీర్యబిందువుతో అని వ్రాసినప్పటికీ అర్థము కానిది ఏముంటుంది? 'వీర్యబిందువుతో' అనుమాట అన్ని తెలుగు ఖురాన్ గ్రంథములలో యున్నది. వీర్యబిందువుతో పుట్టేది శిశు జన్మ తప్ప ఏమీ లేదని తెలియుచున్నది. అటువంటప్పుడు సరిగా అర్థము కాలేదని చెప్పడము పూర్తి తప్పగును. ఒక ఆయత్‌కు తప్పు భావమును చెప్పితే దేవునికి కోపము వస్తుందని చెప్పాడు. ఒక విషయమును గ్రంథములో విశదపరచిన తర్వాత దానిని దాచిపెట్టే ధోరణి అవలంభించిన వారిని దేవుడు శపిస్తాడని సూరా 2, ఆయత్ 159లో మీరు చూడలేదా? దేవుడు స్పష్టముగా ఎన్నో ఆయత్‌లను చెప్పితే మనుషులు స్వార్థముతో వాటిని మూసిపెట్టాలని చూడడము మంచిదా?

**ఆయన :-** ఎక్కడయినా ఒక చోట జన్మలున్నవని ఖురాన్ గ్రంథములో యున్నా దానిని ఒక్క దానిని పట్టుకొని మా సమాజము మొదటి నుండి విశ్వసిస్తున్న దానిని వదలుకోలేము. మా పెద్దలందరూ ముస్లీమ్ సమాజానికి పునర్జన్మలు లేవని చెప్పారు. అదే నిజము. రెండవ జన్మ అంటే దేవుడు అంతిమ దినమున సమాధినుండి లేపినప్పుడే మలి జన్మ అవుతుంది. రెండవ మారు జన్మ అనేది వుంటే అది ప్రళయములో దేవుడు బ్రతికించి లేపునదే యని చెప్పుచున్నాము.

**నేను :-** ప్రళయ దినము లేక అంత్య దినము అనగా మనిషి చనిపోవు దినమును ప్రళయ దినమని, అంత్య దినమని ఎందుకు అనుకోకూడదు?

చనిపోయిన రోజే వాని పాపపుణ్యములను లెక్కించి స్వర్గ నరకముల నిర్ణయము చేయుచున్నాడని ఎందుకు అనుకోకూడదు? స్వర్గ నరకములు ఇక్కడే భూమిమీదనే అనుభవిస్తున్నామని ఎందుకు అనుకోకూడదు? ప్రత్యక్షముగా స్వర్గ సుఖములను అనుభవించే వారిని చూస్తున్నాము. అట్లే నరక బాధలను అనుభవించే వారిని చూస్తున్నాము. ప్రళయము అనినా, అంత్య దినము అనినా, మనిషి చనిపోవు సమయమేయని ఎందుకు అనుకోకూడదు? ఖురాన్ దైవగ్రంథము. శాస్త్రబద్ధమైన గ్రంథము. మీరు చెప్పు మాటలకు శాస్త్రాధారము లేదు. గ్రుడ్డిగా నమ్మవలసిందే. పునర్జన్మల విషయము అర్థము కావాలంటే సూరా ఆరు (6)లో ఆయత్ 95లో వ్రాసిన విషయము అర్థమయితే పునర్జన్మలున్నాయను విషయము అర్థము కాగలదు.

ప్రతి విషయము దేవుని సృష్ఠిలో హేతుబద్ధముగా యుంటుంది. ప్రతి దానికి ఒక కారణము అంటూ గలదు. మనిషి పుట్టుకకు కారణము, చావుకు కారణము గలదు. నేడు ప్రపంచములో అనేక రకముల కష్ట సుఖములకు అనేక రక కారణములున్నవి. అల్లాహ్ ఎవరినీ అనవసరముగా శిక్షించడు. నేడు అనేక శిక్షలను అనగా బాధలను అనుభవించు వారిని దేవుడు కారణము లేకుండా బాధించడము లేదు. దేవుని విషయములో విశ్వాసము లేని వానిని అపమార్గములోనికి పంపుచున్నానని, పూర్తి విశ్వసించిన వానిని జ్ఞానమార్గములో పంపుచున్నానని ఇప్పుడు మనిషి యున్న దానినిబట్టి ఇప్పుడే దేవుడు తేల్చి చెప్పి వానిని అపమార్గముననో, మంచి మార్గముననో పంపుచున్నాడు. అటువంటప్పుడు ప్రపంచ విషయములో తప్పు చేస్తే వెంటనే వానికి శిక్ష చెప్పులాగున యుండును గానీ, ఎప్పుడో కొన్ని యుగముల తర్వాత అని చెప్పడము శాస్త్రబద్ధము కాదు. నేడు మనుషులు అనుభవించు శిక్షలు మనుషులు చేసుకొన్న తప్పులు కావా, దేవుడు విధించిన బాధలు కావా?

మనిషి పాపములను చేసుకొని బాధపడుతుంటే, వారు బాధను భరించలేక అల్లాను వేడుకొంటే దేవుడు క్షమిస్తాడు. దేవుడు క్షమాశీలుడు అన్నమాటకు అర్థము మనిషి చేసుకొన్న పాపమును అనుభవించకుండా క్షమించునని అర్థము కాదా? మనిషికి క్షమాపణ ఎప్పుడు అవసరము అంటే బాధలు అనుభవించేటప్పుడు. బాధలు ఎప్పుడు వస్తాయి అంటే పాపముల ఫలితము మీద పడినప్పుడు. అట్లుకాకుండా మనిషి చేసుకొన్న పాపము ఏదో లోకములో నరకలోకములో అనుభవించును అంటే అప్పుడు క్షమిస్తానని ఈయన చెప్పలేదు. అప్పుడు క్షమాపణ అడుగుతానని వాడు చెప్పలేదు. దేవుడు ప్రత్యక్షముగా పాపములు అనుభవిస్తారని చెప్పియున్నా, చనిపోయినప్పుడే వానికి ప్రళయము, అదే దినమే వాని పాపపుణ్యములకు శిక్షలు ఖరారు చేసి రెండవ జన్మకు దేవుడు పంపుచున్నాడని ఎందుకు అనుకోకూడదు? ప్రతి నిత్యము చనిపోయే వారు ఎక్కడికి పోవుచున్నారు? క్రొత్తగా శిశువులుగా పుట్టే వారంతా ఎక్కడినుండి పుట్టుకొస్తున్నారు? అని ఏమాత్రము ఆలోచించకుండా, దేవుడు గ్రంథములో చెప్పని విషయములను దేవుడు చెప్పాడని అసత్యమును దేవునికి అంటగట్టడమును దేవుడు ఓర్చుకొనునా? నా ఆయత్‌లకు తప్పు అర్థమును చెప్పు వారికీ, నిజ భావములను మూసిపెట్టు వారికి దేవుడు శపిస్తాడని చెప్పియున్నారు. శాపము అనగా శాస్త్రబద్ధమైనది, శాసనములతో కూడుకొనియున్నది. ప్రత్యక్షముగా జరుగునదని అర్థము. దేవుడు అంతగా భయపెట్టి చెప్పినా, ఆయన శిక్షించే వారిలో క్రూరంగా మెలిగే వాడయినా దేవుడంటే భయము లేకుండా ఆయన ఆయత్‌లకు తప్పు చెప్పడము పెద్ద తప్పగును. తీరని శిక్షగును.

**ఆయన :-** మేము అనుకొన్నదే సత్యము మీరు అనుకున్నదే అసత్యమని మీరు ఎందుకు అనుకోకూడదు. మీరే తప్పుగా దేవుని వాక్యములను అర్థము చేసుకున్నామని ఎందుకు అనుకోకూడదు?

**నేను :-** మీరు చెప్పినట్లు అనుకోవచ్చును. ఎదురుగా కనిపిస్తావుంటే తొంగి చూడమన్నట్లుంది నీ మాట. ఒక ముస్లీమ్ చనిపోయి ప్రక్క గ్రామములోనే దేవుడు పుట్టిస్తే, పుట్టి పునర్జన్మలున్నాయని అందరికీ తెలియునట్లు దేవుడు ఆ మనిషికి వెనుక జన్మ జ్ఞాపకమును ఇస్తే, వాడు ముందు జన్మలోని బంధువులను, ఆస్తిపాస్తులను గుర్తుపట్టినప్పుడు పునర్జన్మలు సత్యమని ప్రత్యక్షముగా దేవుడే చూపినట్లు కాదా? అప్పటికీ అర్థము చేసుకోకుండా పునర్జన్మలు లేవు అంటే దేవునికి కోపము రాదా? ***భూమిమీద జరిగిన యదార్థ సంఘటనలను చూచిన తర్వాత మీరే మా మాట సత్యమో కాదో మీరే నిర్ణయించుకోండి.***

ఇపుడు మొదటి విధానములో ఆత్మ గత జన్మలను తెలియజేసిన యదార్థ సంఘటనలను వివరించుకొందాము. 1930వ సంవత్సరము జూన్ లేక జూలై నెల కాలములో లెబనాన్ దేశములో "హాసన్" అనే పేరుగల స్త్రీ జన్మించింది. 'పునర్జన్మలు లేవు' అను చెప్పుచున్న ఇస్లామ్ మతములో హాసన్ జన్మించడము విశేషము. ఆమెకు 20 సంవత్సరముల యుక్తవయస్సులో "ఫరూక్" అను వ్యక్తితో వివాహము జరిగింది. ఫరూక్, హాసన్ జంటకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. హాసన్‌కు "నభీ" అనే సోదరుడు కూడా ఉండేవాడు. అతడు లెబనాన్ దేశములో లెబనాన్ సమాజములో చాలా పేరు పొందినవాడు. అయితే నభీ యుక్తవయస్సులో విమాన ప్రమాదములో మరణించాడు. హాసన్ తన రెండవ కూతురుకు జన్మ

నిచ్చినపుడు అనారోగ్యముపాలై గుండె సమస్య వచ్చింది. దానివలన ఇక మీదట పిల్లలను కనకూడదని డాక్టర్లు సలహా ఇచ్చారు. అయితే హాసన్ ఆ సలహాను ఏమాత్రము పట్టించుకోకుండా 1962లో మూడవ మగబిడ్డకు జన్మనిచ్చింది. 1963లో తన తమ్ముడు నభీ చనిపోవడముతో ఆమె అరోగ్యము మరీ క్షీణించను మొదలు పెట్టింది. అప్పుడు ఆమె తాను చనిపోవడము ఖాయమని అనుకున్నది. కొంతకాలమునకు 36 సంవత్సరముల వయస్సున్న హాసన్ వర్జీనియాలో ఉండే “రిచ్‌మడ్” అనే డాక్టర్‌వద్దకు గుండె ఆపరేషన్ కొరకు వెళ్ళింది. ఆపరేషన్‌కు ముందు తన పెద్దకూతురు లైలాకు ఫోన్ చేయ బోయింది, కానీ చేయలేక పోయింది. ఆపరేషన్ తర్వాత ఒకరోజు మాత్రము బ్రతికి చాలా క్లిష్టపరిస్థితులలో హాసన్ మరణించింది.

హాసన్ మరణించిన పది రోజులకు సుజన్నేగానెమ్ అను బిడ్డ ఒక కుటుంబములో పుట్టింది. సుజన్నేగానెమ్ 16 నెలల వయస్సుగల చిన్న బిడ్డగా ఉండి మాటలు వచ్చీరాని సమయములో ఫోన్ తీసుకొని హలో లైలా అని పదేపదే అంటూ ఉండేది. ఆ కుటుంబము వారికిగానీ, సుజన్నే తల్లికిగానీ లైలా ఎవరో? అంతచిన్న పాప అలా ఎందుకు ఫోన్‌లో పిలుస్తున్నదో అర్థము కాలేదు. తర్వాత ఆరునెలలు గడచిన సుజన్నేకు రెండు సంవత్సరములు వయస్సు పూర్తి అయింది. అప్పుడు మాటలు కూడా బాగా వచ్చాయి. అప్పుడు ఆమె తల్లి లైలా ఎవరు అని అడిగింది. దానికి సుజన్నేగానెమ్ నాకు ఇద్దరు కూతుర్లున్నారని, వారిలో ఒక కూతురు పేరు లైలా అని చెప్పింది. అంతేకాక తన పేరు సుజన్నే కాదనీ, తనపేరు హాసన్ అని, తన భర్త పేరు ఫరూక్ అనీ, తన తల్లిదండ్రుల పేర్లు, తమ్ముళ్ళ పేర్లు, మిగత కుటుంబ సభ్యుల పేర్లు మొత్తము 13 పేర్లు వరుసగా చెప్పింది.

ఇంకా తన ఊరు యొక్క వివరాలు అడిగితే ఇప్పుడు నా తల చిన్నది ఇంకా కొంత కాలమునకు అన్ని విషయములు చెప్పుతానని చెప్పింది.

ఈ విధముగా సుజన్నే చెప్పిన మాటలను విని ఆమె కుటుంబములోని వారు సుజన్నే ముందు జన్మలో హాసన్‌గా ఎక్కడ పుట్టిందో తెలుసుకోవాలను కొన్నారు. ఆ వార్తను పత్రికల ద్వారా బయటికి తెలియజేశారు. అప్పుడు హాసన్ కుటుంబములోని వారూ, హాసన్ భర్త ఫరూక్ సుజన్నేను చూడటానికి వచ్చారు. మొదట ఫరూక్ కుటుంబము చిన్నపాపగానున్న సుజన్నే చెప్పు మాటలను నమ్మలేకపోయారు. హాసన్ బంధువులను సరిగ్గా వారి పేర్లతో సుజన్నే పిలువడముతో ఫరూక్ కుటుంబము ఆ పిల్లను నమ్మడము మొదలు పెట్టింది. హాసన్ తన నగలనూ, ఇతర ఆభరణములనూ వర్జీనియాలోని తన తమ్ముడు హెర్‌కులేకు ఇచ్చింది. ఇది సర్జరీకి ముందు జరిగిన సంగతి. ఆ నగలను హెర్‌కులేకు ఇస్తూ, వాటిని తన కూతుర్లకు అందజేయ వలసిందిగా చెప్పింది. ఈ విషయము హాసన్‌కు వారి కుటుంబీకులకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఇవన్నీ విన్న తర్వాత సుజన్నే గతజన్మలో హాసన్‌గా ఉండేదని ధృవీకరించబడింది.

చదవడానికిగానీ, వ్రాయడానికిగానీ రాకముందే సుజన్నే పేపరు మీద ఏవో నంబర్లు వ్రాసేది. తర్వాత ఆ నంబర్లు ఫరూక్ ఇంటి ఫోన్‌నంబరని తెలిసింది. సుజన్నేకు ఐదు సంవత్సరముల వయస్సున్నపుడే రోజుకు మూడు సార్లు ఫరూక్‌కు ఫోన్ చేసేది. ఫరూక్‌ని కలిసినపుడు సుజన్నే అతని ఒడిలో కూర్చొని నిద్రించేది. పోలీస్ ఉద్యోగము చేసే ఫరూక్, మరణించిన తన భార్య హాసన్ సుజన్నేగా జన్మించిందని అంగీకరించాడు. సుజన్నేకు ఏవైనా ఫోటోలు చూపిస్తే వాటిలోని వ్యక్తుల్ని గుర్తించడమే

కాకుండా, హాసన్‌కు ఆ ఫోటోలోని వారితో సంబంధాన్ని సుజన్నే వివరించేది. కొన్ని హాసన్‌కు తప్ప ఎవరికీ తెలియని వివరాలను సుజన్నే వివరించేది. దీనివలన పోయిన జన్మలోని హాసన్ ఈ జన్మలో సుజన్నేగా పుట్టినదని పూర్తి నిరూపణకు వచ్చినది. ఈ విషయముతో పునర్జన్మ ఉన్నదనీ నిరూపించ బడినది. 40 సంవత్సరముల క్రితము జరిగిన ఈ సంఘటనను ఎవరూ కాదనలేరు మరియు ఖండించనూ లేరు.

దీనికి అనుసంధానముగా పవిత్ర ఖురాన్‌లో సృష్ఠికర్త అయిన దేవుడు మరొక మాటను కూడా చెప్పాడు. 53వ సూరా అన్‌నజ్మ్ (నక్షత్రము) 44,45,46 ఆయత్‌లలో **44) నిశ్చయముగా ఆయనే మరణింపజేసేవాడు మరియు జీవితాన్ని ప్రసాదించేవాడు. 45) నిశ్చయముగా ఆడ, మగ జంటలను సృష్ఠించినవాడు ఆయనే, 46) ప్రవహింపజేసిన వీర్యబిందువు నుండి మరొక జీవితమును ప్రసాదించడము ఆయనకే (దేవునికే) చెల్లును.** ఈ విధముగా ఖురాన్‌లో మరికొన్ని వాక్యములు కనిపించగలవు. వాటిని సరిగా అర్థము చేసుకొన్నపుడు పైన చెప్పుకొన్న హాసన్ 36 సంవత్సరములకు మరణించి తిరిగి పదిరోజులకే సుజన్నేగా జన్మించిన సత్యము అర్థము కాగలదు. హాసన్ మరణించి తిరిగి పుట్టినది సత్యమైనపుడు పునర్జన్మలు లేవు అను వారి మాటలు అసత్యమగును. అటువంటి అసత్యములను ప్రవక్తలకు అంటగట్టి, వారి గొప్పతనమునకు ఆటంకము కలిగించకూడదు. ప్రవక్తల మాటలను తప్పుగా అర్థము చేసుకోవడము వలన, దేవుని మాటలనే అసత్యము చేసినట్లగును. దేవుని మాటలను అసత్యముగా చూపడము వలన, ఎవరికైనా భయంకరమైన పాపము సంభవించగలదు. అందువలన దేవుని జ్ఞానమును ఏ మతస్థులైనా సరిగా అర్థము చేసుకోవాలని కోరు చున్నాను. ఖురాన్‌ను పరిశోధించిన కొందరు పెద్దలు ఖురాన్‌లో ఇంకా

కొన్ని వాక్యములు పునర్జన్మల గురించి ఉన్నాయని వ్రాశారు. వాటిని క్రింద పొందుపరుస్తున్నాము చూడండి.

1) మరి ఎప్పుడైతే శరీరము నశిస్తుందో, అపుడు ఆత్మ (జీవాత్మ) ఆ యొక్క పాత కవచాన్ని వదలివేసి, అందుండి విడుదలై క్రొత్త శరీరాన్ని ధరిస్తుంది. మానవ దేహము ఒక వ్యక్తికి ఒక రుతువులాగ కొంతకాలము ఉంటుంది. ఆత్మకు ఆ సమయము పూర్తికాగానే దాన్ని విడిచి ఇంకో శరీరాన్ని తీసుకొంటుంది.

2) దైవత్వము ఆత్మలను (జీవులను) ఉద్భవింపజేస్తుంది. ఇక్కడికి తిరిగి తిరిగి పంపిస్తూ ఉంటుంది. ఎప్పుడైతే ఆ ఆత్మ దైవత్వాన్ని తిరిగి చేరుకుంటుందో అపుడా ఆత్మ తిరిగి జన్మించనవసరములేదు.

3) సృష్టికర్తయిన దేవుడు నిన్ను తయారు చేసినా, నీవు చనిపోయినపుడు తిరిగి జన్మింపజేసినా, అలాగే నీవు జన్మించిన తర్వాత నిన్ను మరణింప జేసినా, ఇలా తనని నీవు చేరే దాకా ఈ జనన మరణ చక్రములో నిన్ను ప్రవేశపెట్టినా ఆ దైవత్వాన్ని, దేవున్ని విస్మరిస్తావు.

4) నిన్ను సృష్టించి నీకొక ఉనికిని తయారు చేసినదీ, నీవు చనిపోతే నిన్ను జన్మింపజేస్తున్నదీ, నీవు జన్మించిన తర్వాత నిన్ను మరణింపజేస్తున్నదీ ఆ దేవుడు ఒక్కడే.

5) రాతినుండి గింజను బద్దలుకొట్టుకొని మొలకెత్తించేది, చనిపోయిన వారిని తిరిగి జన్మింపజేసేది, జీవిస్తున్న వారిని తిరిగి మరణింపజేసేది ఆ దైవత్వమే.

6) ఇప్పుడు మీకు సత్యాన్ని బోధిస్తున్నాను, ఏ ఆత్మలకైతే ఒకదానిపట్ల (దైవముపట్ల) తీవ్ర ఆసక్తి, ఇష్టము ఉంటే ఆ ఆత్మలు ఎన్ని శరీరములు ధరించినా, ఎన్ని పేర్లు పొందినా సరే అవి దేవునికి దగ్గరవుతాయి.

ఈ వాక్యములు దైవత్వము యొక్క గొప్పతనమును తెలియజేయడమే కాక, మనిషికి జన్మలున్నవని కూడా తెలియజేయుచున్నవి. మనిషి తాను చేసుకొన్న పాపపుణ్యములను అనుభవించుటకే పుట్టుచున్నాడనునది సత్యము. దానినే కర్మసిద్ధాంతము అంటాము. ఆ కర్మ సిద్ధాంతమును తెలియజేయు వాక్యములు కూడా పవిత్ర ఖురాన్ గ్రంథములో ప్రవక్తగారు అక్కడక్కడ తెలియజేశాడు. వాటిలో కొన్ని ఈ విధముగా ఉన్నవి.

1) దైవత్వము లేక దేవుడు ఏ ఆత్మనూ (ఏ జీవిని) తనశక్తికి మించి చేయమని నిర్దేశించడు. ఆ ఆత్మ ఏమి సంపాదించుకుందో దానినే పొందుతుంది. మరీ దానికి ఏది లభించునన్నది దాని బాధ్యతే.

2) ప్రతి ఆత్మ తాను చేసిన మంచిని తిరిగి పొందుతుంది. అలాగే తాను చేసిన చెడునూ తిరిగి పొందుతుంది.

3) మనము మన కర్మల లెక్కలు చూచుకొన్నపుడు మనమే మనల్ని తీర్మానించుకొంటాము. ఏ ఆత్మగానీ, దేనికిగానీ దోషికాదు. అయితే ఆవగింజంత అయినా సరే ఆ కర్మను అది పాపమైనా, పుణ్యమైనా మనము తిరిగి పొందుతాము. మన ఆత్మ క్షేత్రము ఆ లెక్క విషయములో చాలా పక్కాగా ఉంటుంది.

4) "మనము ఇతరులకు ఏమి చేశాము, ఇతరులు మనకేమి చేశారు" అను అన్ని విషయములు చాలా లెక్కగా మనదగ్గరుంటాయి

5) విశ్వ మానవుల గురించి ఖురాన్‌లో అత్యద్భుతమైన వాక్యాలున్నాయి. కానీ మతముల యొక్క సంకుచిత అవగాహనతో ఈ సత్యాన్ని మనము మరచి పోయాము. ప్రపంచములోని ఏ మతస్థులైనా సరే, ఎవ్వరైతే దైవాన్ని విశ్వసిస్తారో వారికి చివరి రోజున భయములేదు మరి వారు దుఃఖింపరు. చూచారా! ఈ వాక్యము ఎంత గొప్పగా ఉందో?

కర్మ సిద్ధాంత వాక్యములను బట్టి ఖురాన్ చాలా గొప్పది. ప్రపంచము లోని సమస్త మానవాళికి వర్తించు సూత్రములను చెప్పినదని అర్థమగు చున్నది. ఖురాన్ చెప్పిన కర్మసిద్ధాంతము ప్రకారము మనిషి చేసుకొన్న కర్మకు మనిషే బాధ్యుడు. మనిషి చేసుకొన్న దానిని అనుభవింపజేయుటకు మనిషిని దేవుడు తిరిగి పుట్టించవలసి వచ్చినది. ఏ కర్మలేని వాడు తిరిగి పుట్టనవసరములేదు. అటువంటి వారు దేవుని సన్నిధానములోనే ఉండి పోవును. దేవుడు మొదట కర్మలేని మనిషిని పుట్టించి తానే అతనిని జీవింపజేయగా, మనిషి తనను పుట్టించిన దేవున్ని మరిచిపోయి, తానే బ్రతుకుచున్నానని అనుకొని లేని కర్మను సంపాదించుకొని మరల మరల పుట్టింపబడుచున్నాడు. మేము ఇంతగా పునర్జన్మలున్నాయని చెప్పినా నమ్మనివారు ఉండవచ్చును. అందుకని ముస్లీమ్ కుటుంబములో చనిపోయి తిరిగి ముస్లీమ్ కుటుంబములోనే పుట్టిన ఒక వ్యక్తి యొక్క వాస్తవ సంఘటనను చూద్దాము. ఇంతకుముందు చెప్పినది ఒక ముస్లీమ్ స్త్రీ అయిన హాసన్ యొక్క పునర్జన్మ. ఇపుడు ఒక ముస్లీమ్ అయిన పురుషుని జన్మను గురించి చెప్పుచున్నాము. ఇది కూడా లెబనాన్ దేశములో జరిగినదే.

1943లో లెబనాన్ దేశమందు "ఫర్‌మట్‌ట" అనే నగరములో రషీద్ ఖాదీజ్ అను వ్యక్తి జన్మించాడు. అతను ఆటోమొబైల్ మెకానిక్‌గా జీవించే వాడు. అతనికి 25 సంవత్సరముల వయస్సులో ఒకనాడు ఇబ్రహీమ్ అనే స్నేహితుడు రషీద్‌ను కారులో షికారుకు తీసుకెళ్ళాడు. ఇబ్రహీమ్ సముద్రప్రాంతములో కారును వేగముగా నడుపుచుండగా, మిలటరీ బీచ్ అనే స్థలములో కారు అదుపుతప్పి ప్రమాదానికి గురియైనది. అప్పుడు రషీద్ కారులోనుండి బయటకు పడిపోయాడు. అలా పడినపుడు తలకు బలమైన గాయము కాగా రషీద్ అక్కడికక్కడే మరణించాడు. రషీద్

మరణించిన తర్వాత ఒక సంవత్సరమునకు "డానియల్‌జర్దీ" అనునతడు జన్మించాడు. డానియల్ జర్దీకి మాటలు వచ్చినపుడు పలికిన తొలిమాట ఇబ్రహీమ్. ప్రమాదము జరిగిన దినమున కారునడిపిన తన స్నేహితుని పేరు ఇబ్రహీమ్. డానియల్ జర్దీ అలా అనడము ఎవరికీ అర్థము కాలేదు. ఇబ్రహీమ్ అని ఎందుకు అన్నాడో తెలియలేదు. తర్వాత రెండేళ్ళ వయస్సులో డానియల్ జర్దీ, తనతల్లి "లతీషా" తో నేను ఇంటికెళ్ళాలి అని అన్నాడు. తర్వాత ఆరు నెలలకు, అనగా రెండున్నర సంవత్సరమునకు ఇది నా ఇల్లు కాదు, నువ్వు నా తల్లీకాదు. నాకు నాన్న లేడు, నా తండ్రి మరణించాడు అని కొన్ని మాటలు మాట్లాడాడు. అప్పటి తన తండ్రి అయిన యూసఫ్‌ని నాన్న అని పిలువకుండా యూసఫ్ అని పేరుతో పిలిచేవాడు. అంతేగాక తన తండ్రి "నయీమ్" అని చెప్పేవాడు. నయీమ్ అనేది రషీద్ తండ్రి యొక్క పేరు.

డానియల్ జర్దీకి రెండున్నర సంవత్సరముల వయస్సులోనే అతని కుటుంబమంతా పిక్నిక్‌కు వెళ్ళగా వారితోపాటు జర్దీ కూడా పోయాడు. అప్పుడు వారి బంధువులలో ఒకరు పర్‌మట్‌టా అను పేరును తప్పుగా ఉచ్ఛరించగా, జర్దీ సరిచేసి చెప్పాడు. అప్పుడు జర్దీ తండ్రి అయిన యూసఫ్ ఈ పేరు నీకెలా తెలుసు అని అడుగగా! ఈ నగరము పేరు నాకు బాగా తెలుసు, ఇది నేను నివసించిన నగరమే అని చెప్పాడు. డానియల్ జర్దీ చెప్పిన మాటలు అతని కుటుంబము వారికి ఏమీ అర్థము కాలేదు. తర్వాత కొంత కాలమునకు డానియల్ జర్దీ, తన తల్లీ కారులో ప్రయాణిస్తుండగా, వారి కారు మిలటరీ బీచ్ దగ్గరికి వచ్చేటప్పటికి ఆ ప్రదేశాన్ని చూచిన డానియల్ కళ్ళు మూసుకొని, చేతులతో ముఖాన్ని దాచుకొని ఏడ్వను మొదలు పెట్టాడు. తర్వాత "నేను మరణించింది ఇక్కడే" అని గట్టిగా

అరిచాడు. అంతేకాక గతజన్మలో తాను కారు మెకానిక్‌ననీ, తన స్నేహితుడు ఇబ్రహీమ్ కారు నడుపుతుండగా కారు అదుపు తప్పిందనీ, అపుడు బయటపడిన తాను తలకు గాయమై మరణించానని చెప్పాడు.

స్కూల్లో డానియల్ జర్దీ నర్సరీ చదువుచున్న రోజుల్లో తనపేరు డానియల్ జర్దీ కాదనీ, రషీద్ ఖాదీజ్ అని చెప్పాడు. అదే స్కూల్లోనే మరొక సందర్భములో యుక్తవయస్సులోనున్న అందమైన లేడీటీచర్‌ను చిన్నగా గిల్లి నువ్వు చాలా అందంగా ఉన్నావని చెప్పాడట. ఆ విధముగా మాటలలోనూ, చేతలలోనూ కొన్ని సందర్భములలో విచిత్రముగా కనిపిస్తున్న డానియల్, చెప్పేది ఎంతమటుకు నిజమోనని తెలుసుకొనుటకు అతని తండ్రి యూసఫ్, పర్‌మట్‌టాకు వెళ్ళి డానియల్ వర్ణించిన విధముగా కారు మెకానిక్‌ను గురించి, మిలటరీ బీచ్‌వద్ద ఆక్సిడెంట్‌ను గురించి విచారించగా డానియల్ చెప్పినదంతా నిజమని తెలిసింది. ఈ విషయమును తెలుసు కొనిన రషీద్ ఖాదీజ్ యొక్క బంధువులూ, మిత్రులూ డానియల్‌ను చూచే దానికి బయలుదేరి పోయారు. అలా పోయిన వారిని చూచిన డానియల్ రషీద్ చెల్లెలు నజ్లాను వెంటనే గుర్తించి ఆమెను పేరుతోనే పిలిచాడు. మొదట తన బంధువులనందరినీ చూడగానే డానియల్ తన తల్లి లతీషాతో వారందరికీ అరటి పళ్ళు తెచ్చి ఇమ్మని చెప్పాడు. గత జన్మలో రషీద్‌కు అరటి పళ్ళంటే చాలా ఇష్టము. రషీద్ మరణము తర్వాత రషీద్ గుర్తుకు రాకుండ ఉండడానికి రషీద్ తల్లి అతని చెల్లి ఇద్దరు అరటి పళ్ళు తినడము మానేశారు. తర్వాత డానియల్ పర్‌మట్‌టకు వెళ్ళగానే తన స్నేహితుడైన ఇబ్రహీమ్‌ను మరియొక స్నేహితుడైన బజాజ్‌ను గుర్తించి మాట్లాడాడు.

రషీద్ కుటుంబము వారంతా రషీద్ తిరిగి డానియల్ జర్దీగా పుట్టాడని అంగీకరించారు. రషీద్ కుటుంబము డానియల్ ఫోటోను తమ ఇంటిలో

ఉంచుకొన్నారు. రషీద్ తన రెండవ జన్మలో కూడా కారు నడపాలంటే భయపడేవాడు. ఈ విధముగా కారు నడపాలంటే వచ్చు భయముగానీ, వెనుకటి జన్మ జ్ఞాపకముగానీ డానియల్ తెచ్చుకొంటే వచ్చినవి కావు. డానియల్‌కు ఏమాత్రము సంబంధము లేకుండా అతని శరీరములోనున్న ఆత్మ చేసిన మూడవ పనిగా మనము గుర్తించవచ్చును. మనిషి చనిపోతే మళ్ళీ జన్మిస్తాడని మనుషులకు తెలియజేయుటకు ఆత్మ చేసిన పనిగా మనము చెప్పుకోవచ్చును. ప్రతి మనిషిలో జీవాత్మకు తోడుగా ఆత్మ నివసిస్తూ ఎక్కడో ఒకచోట ఈ విధమైన జ్ఞాపకమును తెప్పించిన సంఘటనలే పునర్జన్మ వృత్తాంతములు. పునర్జన్మలు లేవు అను వారి వాదన అబద్ధమనీ, ఉన్నాయనడము శాస్త్రబద్ధమనీ ఆత్మ తెలిపిన ఇటువంటి సంఘటనల వలన తెలియుచున్నది.

**ఈ విషయములన్నీ ప్రత్యక్షముగా కనిపించినా పునర్జన్మలు లేవు అనడము అజ్ఞానమగును.**

ఇట్లు

యోగీశ్వర్

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# కృష్ణ మూస

## (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)




**Author :**

**The Only GURU of Three Religions**

**The Spiritual Emperor, Thraitha Theorem Originator**

**Sri Acharya Prabodhananda Yogeeshwarulu**

**www.thraithashakam.org**